శ్రీరస్తు.

# కళావిలాసము.

ఇది

క్షేమేంద్రమహాకవి సంస్కృతమునకుఁ

దెనుఁగువచనము.

శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారిచే వ్రాయఁబడినది.



ఆర్యపుస్తకాలయము,

రాజమహేంద్రవరము.

శ్రీరస్తు.

# కళావిలాసము.

ఇది

క్షేమేంద్రమహాకవి సంస్కృతమునకుఁ

దెనుఁగువచనము.

కొత్తపల్లి సూర్యారావుగారిచే వ్రాయఁబడినది.



ప్రకాశకులు:

ఆర్యపుస్తకాలయము,

రాజమహేంద్రవరము.

1937



క్రొత్తపల్లి సూర్యారావుగారు.

# ద్వితీయముద్రణపీఠిక.

ఇది ప్రథమమున శ్రీసరస్వతీ పత్రికాముఖమున వెలువడినది. నేఁటికి దీనికి మరల బైటికివచ్చి పదిమంది సజ్జనులయెదుట నిలుచునదృష్టము పట్టినది. చేవలేనివారివిషయములోఁ బెద్దలు "పామునెదుటనైనఁ బడవచ్చును గాని పండితులయెదుటఁ బడరా" దందురు. చేవలేనిదైనచో నీకళావిలాసము మొదటనే పండితుల యెదుటఁ బడియుండకపోవును. దీనిచేత చాలమంది పండితు లెఱిఁగియున్నారు. "బాధవచ్చుదినములును భాగ్యమువచ్చు దినములును దెలియ"వందురు. ఆర్యపుస్తకాలయాధిపతులమూలమున నీకబ్బము పదిమంది యార్యులచేతులలోఁ బడు భాగ్యము నందినది.

సాధారణముగా నిందలికళలను "నేను జదువలేను, తెలిసికొనలే"దని చెప్పువా రుండఁగూడదు. అట్టి వారెంతటివేత్తలయినను గళావిషయమున వెనుకఁబడినవారే. ఈకళలను దెలిసికొనినవానియెదుట నింతటియంతటివారు నిలువఁజాలరు. ఇదినీతిబోధకు నీతిబోధిని, కళాబోధినికిఁ గళాబోధని, కథలకుఁ గథామంజరి. వెఱ్ఱివెఱ్ఱికథలనుజదువకుఁడు. దీనిలోనికథలు నీతిదాయకములు, జ్ఞానదాయకములును. బాలురు వృద్ధులు దీనిని జదివి యార్యపుస్తకాలయమును గౌరవింపుఁడు. కళావిలాసముల నొందుఁడు.

ఈకళావిలాసమును, ఆర్యపుస్తకాలయాధికారులు శ్రీ. నాళము అప్పలనరసింహముగారికిఁ బ్రకటించుకొన నేననుమతి యిచ్చితిని.

క్రొత్తపల్లి సూర్యారావు.

# ప్రథమముద్రణపీఠిక.

---

ఈగ్రంథమును మహాకవిక్షేమేంద్రుఁడు సంస్కృతమున 10 సర్గము లుగా నార్యావృత్తములతో రచించెను. ఈమహాకవి కృతగ్రంథములు పెక్కులు గలవు. కాని దీనియందు హితోపదేశమునందు విష్ణుశర్మ నీతులువలెనే లోకులు చేయుమోసములం దెలుపనెంచి మూలదేవుండను నొక నేర్పరి వణిక్పుత్రున కుపదేశించు మిషంబున బాగుపడఁ దలఁచిన వారికెల్ల హస్తపుస్తకంబుగ నుం డున ట్లుపదేశములం జేసియున్నాఁడు. 'పుస్తకం హస్తభూషణ' మనునా ర్యోక్తి యిప్పొత్తముం దాల్చిన హస్తమునకే చెల్లవలయును. క్షేమేంద్రుఁడు లోకానుభవముపూర్తిగాఁ గలవాఁ డనుట కీగ్రంథమే సాక్ష్యమిచ్చును. దీనిని మొదట బొంబాయిలో రా॥రా॥ ఇచ్ఛారాం సూర్యారాం దేశాయీయను పండితుఁడు గుజరాతిభాషలోనికిమార్చెను. వారియనుమతిపైఁ బిమ్మట రా॥రా॥ ఉంబాలాల్ పండితుని పుత్రుఁడు రామప్రతాపశర్మగారు హిందీలోనికి భాషాం తరీకరించెను. ఇచ్ఛారాం సూర్యారాం దేశాయీగారు పెంచి పెద్దగ్రంథముం గావించిరి. దానికే రామప్రతాపశర్మగారి సరియైన భాషాంతరీకరణము. నేను వారి యిద్దఱిగ్రంథములనుండి వ్రాయవలెనని తలంచి పరిచయము గల హిందీ గ్రంథముం దెప్పించి చదివితిని. ఎంతపెంచినను ఎన్నిచమత్కారములు క్రొత్తవి చేర్చినను క్షేమేంద్రమహాకవి సంస్కృతమునం దున్నంత యభిమానము తక్కిన వానిపై నాకుఁ గలుగ లేదు. మన గుజరాతి, హిందీ పండితు లెంతపెంచి విస్పష్టముగా వ్రాసినను, క్షేమేంద్రుని సంస్కృతములోఁ గుదించి కుదించి వ్రాసి నదానికంటె నుపయోగముగను మనోహరముగాను నాకుఁ గనఁబడదు. లోక ము భిన్నరుచికలది కావునఁ బండితులు నాయాంధ్రభాషాంతరీకరణమునందలి లోపములను మన్నించి గుణమును గ్రహింపఁ బ్రార్థించెదను.

క్రొత్తపల్లి సూర్యారావు.

శ్రీరస్తు.

# కళావిలాసము.

## ప్రథమసర్గము.

శ్రీమల్లక్ష్మీపతేః పరిష్వంగమంగళగృహంబును రత్నోజ్జ్వలంబునగుటం జేసి విష్ణువక్షస్స్థలంబును బోలి యుజ్జ్వలంబును విశాలంబు నగు నగరం బొక్కటి కలదు. అందలి మణికుట్టిమస్థలంబుల, మౌక్తికతోరణంబులు ప్రతిఫలించుటం జూచు వారి కానగరసౌధంబుల నాదిశేషుండు బహురూపములు ధరించి మోయుచున్నట్లుతోంచును. మఱియు నాపట్టణమున రాత్రి యనుమగువ కట్టుకొన్న యంధకారరూపవస్త్రంబును హరింపం బోవు దొంగవానివంటి యింద్రనీలకంపుగోడలకాంతిపుంజ మభిసారికలకు విఘ్నకారి యగుచుండును. హరనయనజ్వలనజ్వాలన్మృతవలె నశించిన మన్మథుండా పురమునం గల శశివదనల వదనకాంతి యను నమృతంబుచే మరలం జీవించుచున్నాండు. అస్ఫుటభేదనంబున రతిపరిశ్రాంతాంగనల దేహంబులం బొడమిన చెమ్మటలచే శీతలుండై తత్పురమ్యసౌధంబు లగు కొప్పులం దుండి జాజుల సుగంధిపుష్పంబుల సౌగంధ్యంబు వహించి సమీరం బనవరతముం జరించుచుండు. అచ్చోటి కొలంకుల నవబిసకిసలంబులం గబళించి కషాయకంఠంబులను సంచరించుచుండు రాయంచలపలుకులు మహాలక్ష్మినూపురారవము వలె నలరారును.

ఆపురవరంబున మరకతమణినిర్మితంబులగు ధారాగృహంబులఁ
గాంచి యింద్రధనుస్సంయుతంబు లగు ప్రావృణ్మేఘంబు లని
ముగ్ధమయూరంబులు నృత్యములు గావించు చుండును. ఆవీటఁ
జెలంగు చంద్రకిరణ ప్రసారితంబు లగు స్ఫటికశిలాతలంబులఁ
దిరుగు సుందరులు కలశాబ్ధితరంగంబులం బోలుచు నప్సరసల
పొలుపు వహియింతురు. అచ్చట మాయలమారు లగు ననేక
ధూర్తులం బరాభవించి నట్టియు సమస్తకలలకు (మోసములకు)
గనియు నగు మూలదేవుం డనునొక్కపురుషవరుండు గలండు.
నానాదేశములనుండి వచ్చు ధూర్తులవలనఁ దనబుద్ధివిభవముచే
ధనము గ్రహియించుచుఁ దనంతట తానె చక్రవర్తివిభవమును సం
పాదించెను.

ఒకనాఁడు భోజనాంతరమున స్నేహితులతోఁ గొలు
వు దీర్చి యున్నమూలదేవునికడకు హిరణ్యగుప్తుఁ డనువర్త
కుఁడు చంద్రగుప్తుఁ డనుపుత్రునితోఁ గూడ వచ్చి యాతనికి
నమస్కరించి కానుక లర్పించి యతనివలన ననుజ్ఞగొని కూ
ర్చుండి రెండుగడియలకాలము మిన్నక యుండి "అయ్యా!
నిపుణు లగుమీముందఱ మావంటి వారి యల్పపరిచయము
గల మాటలు పట్టణములోనికి వచ్చిన పల్లెటూరి వనితవలెఁ
బ్రాగల్భ్యము లేనివిగా నుండును. బృహస్పతిం ధిక్కరించు
బుద్ధిగల నీప్రజ్ఞాకిరణములు సూర్యకిరణములు సమస్తతిమిరం
బులం బోనడంచి యాశలను వెలిఁగించునట్లు మాకుఁ గూడ
నాశలను బ్రకాశింపఁజేయుచున్నవి. పుట్టినది మొదలు నమిత

ముగ మణిమౌక్తిక కనకములు గడియించి భండారము నిండించిన వారికి నీ వొక్కఁడే కుమారుఁడు వయసు మళ్లినపిమ్మట జనియించెను. బాల్యము మోహమున కునికిపట్టు, యౌవనము మన్మథోన్మాదకారణము, ధనము గాలిచేఁ గదలియాడుచున్న తామరపాకులోని నీరునంటిది. మృగనేత్రలు మనోహరమైనవారు, ధూర్తులు భోగాబ్జమధుకరులు. పరంపరగా నీదోషములన్నియు నాకుమారునకును సంభవింపఁగలవు. ధూర్తులచేతి కందుకములును వారవధూచరణనూపురమణులు నగు ముగ్ధులగు ధనికపుత్రులకు ముక్తిలేదుగదా ! దేశకాలముల నెఱుంగక జిహ్వాచాపల్యమున నెగురశక్తిలేనివైనను గుంటుకొనుచు వచ్చిన చిన్నపిట్టలవలెనే మంచి చెడ్డలెఱుంగని ధనికబాలురును ధూర్త మార్జాలములచే భక్షింపఁబడుదురు. ఈబాలుఁడు నీయాశ్రితుని కుమారుఁడు, గావున, నీకుమారుఁడే, సందియము లేదు. అట్లగుటంజేసి వీని కనశ్వర మగునభివృద్ధిని బ్రసాదింపుము. అని వినయముగాఁ దలవాంచి యుక్తముగాఁ బలికినయాసెట్టిపలుకు లాలకించి ప్రేమ గడలుకొన "నోయీ! నీ బిడ్డఁడు మాగృహంబునఁ దనయింటిలోవలెనే హాయిగ నుండుఁగాక ! క్రమక్రమముగా నాయుపదేశమువలన సకలకలాహృదయమును గ్రహింపఁగలఁడని మూలదేవుఁడు చెప్పఁగా హిరణ్యగుప్తుఁడు తనయు నక్కడ విడిచి సంతసంబున నామనుజవరేణ్యునకు నమస్కరించి తనయింటికిం బోయెను.

పిమ్మట శిథిలకిరణజాలుండై, ధూసరకాంతితో, నిరంబ నుండై మెల్లమెల్లఁగ ధూర్తుల కోడిపోయి పైనివేసికొన్న బట్ట నుగూడఁ బోఁగొట్టుకొని వెల్లనైనమొగముతో జూదరి పాఱి పోయినట్లు సూర్యుఁ డస్తగిరిశిఖరము చాటునకుం బోయెను. అనంతరమునఁ జీఁకటియను నేనుఁగుముందఱ సిందూరపటలపా టలంబగు సంధ్యారాగము బయలు వెడలెను. దినదినము దిన ప్రభయను మానవతిని సూర్యుఁడు విడిచిపెట్టుచున్నను వాని వెంట నంటియే తిరుగుచున్నది కాని రాగముగలది యైనను సం ధ్యాకాంత యట్లుచేయుట లేదు. స్త్రీలహృదయములు తెలిసి కొనుట కష్టముకదా! ఆకాశమునఁ గమలాకరమందు సంధ్యా కాంతి తగ్గిపోయినంతట దిక్కు తెలియని నల్లతుమ్మెదలవలెనే చీఁకటి నలుతట్లకుఁ బరువిడసాగెను. సూర్యవిరహముచే భూ దేవి యంధకారరూప మగు మోహమునం దగుల్కొనియెను. తీవ్రము గలిగినవాఁడైనను, బెనిమిటి, దేశాంతర మేఁగినపుడు స్త్రీలకుఁ బ్రేమపాత్రుఁడు కాకపోఁడు. రాత్రి, ముత్యాల దం డల వంటి తెల్లనిచుక్కలతో నిండి నెమిలి వెండ్రుకలభూషణం బుల నిడుకొన్న శబరాంగనవలెఁ గన్పట్టెను. పాంథుల యి ల్లాండ్రకగ్నివంటివాఁడును గలువలనిద్రలేపు దూతయుఁ జక్ర వాకములకు దుఃఖకరుఁడునగు చంద్రుఁ డుదయించెను. మఱియు వాకమలవిరోధి మన్మథుని శ్వేతచ్ఛత్రమువలెను, దిగ్వనితల స్ఫటికదర్పణము వలెను, నిశాంగననొసటి తెల్లబొట్టువలెను ప్రకాశించెను. కిరణావళితో వెలుఁగుచుఁ గలువలఁ బొంగించు

నాచంద్రుఁడు స్వర్గగంగాతటమునఁ దామరతూఁడులలోని రాజహంసమువలెఁ బొడకట్టెను. చంద్రునిసంబంధమున రాత్రి శోభిల్లెను, రాత్రిసంబంధముచే మన్మథుఁ డుప్పొంగెను. కామదేవప్రసంగములచే వసంతోత్సవము ప్రబలెను. వసంతోత్సవముక తన మందయానల విలాసము లేపుమాచెను. ఆసమయంబున ధూర్తబంభరములు ముడిఁగియున్న పద్మినిం ద్యజించి వికసితకుముదవనముం బ్రవేశించినవి. వెన్నెలయను విభూతి పూసికొని చంద్రఖండ మను కపాలముం గొని నక్షత్రములను నెమ్ముల పేరులతో నిశాంగన కాపాలికస్త్రీవలె శోభిల్లెను.

---

## కథాప్రారంభము.

ప్రౌఢచంద్రకిరణప్రకర మెల్లెడల వెదచల్లఁబడిన యారాతిరి తనమేడ ప్రక్కనున్న యుద్యానవనములో నిర్వర్తితావసరకార్యుండై, మిత్రులతోఁ గూడి, కందలి మొదలగు ముఖ్యశిష్యులు పాదపీఠము చుట్టును బరివేష్టింప నాకసమునఁ జంద్రుఁడువలెఁ బటికంపు గద్దియం గూర్చుండి మూలదేవుఁడు తన కభిముఖముగా నున్న శ్రేష్ఠితనయునింజూచి దంతకాంతులచే వెన్నెలను సిగ్గుపడున ట్లొనర్చుచు నిట్లనియెను. పుత్రా! కుటిలులైన వంచకు లొనర్చుకలాహృదయసారముం జెప్పుచున్నాఁడ. దానిం దెలిసికొన్న మెఱుపువలెఁ జంచలయగులక్ష్మి యచంచలయై నీయింట నెల్లపుడు నిలుచు. ఈసంసారమనునది యడవిలో నా

కులు గడ్డిమున్నగువానితో నావరింపఁబడి తెలియరాకుండ నున్న నూయివంటిది. ఇం దాను తెలియక లేళ్లవంటి మూర్ఖులు పడి లేవలేకపోవుచున్నారు. ఆనూతిని గుటిలములగు మాయాభుజంగములచే నావరింపఁజేసి దంభుఁ డనువాఁ డచ్చటఁ గాపుండును. ఇతఁడు మాయలకు మంత్రరహస్యము వంటివాఁడు. ఈప్సితార్థముల నిచ్చుటకుఁ జింతామణి యట్టివాఁడు. తత్ప్రభావమువలన ధూర్తుల యైశ్వర్యమును వృద్ధిపఱచుచుండును. నీటిలోఁ జేఁపలు నడచిన జాడ యెట్లు తెలియదో యట్లె దంభుని గతియు నెవ్వఁకిని బోధపడదు. వానికిఁ బాదములు గాని హస్తములు గాని శిరస్సు మొదలగునవిగాని కనఁబడవు. మంత్రములచేతఁ బాములు దారుయంత్రములచేత లేడులు నురులచేత బిట్టలుఁ బట్టువడినట్లు మానవు లాదంభునిచేతఁ జిక్కుదురు. ఆతండు జనులహృదయాకర్షణము చేయును; మాయామందిరమునకు మూలస్తంభము; జగత్తును జయించుట కారంభకుఁడు; నిరాకారుఁడు. మాయలు కౌటిల్యములు నను వేయియాకులు గలిగి యెడతెగక తిరుగుచున్న ప్రపంచచక్రమునకు నాభి యీదంభుఁడే.

దంభమను ఫలవృక్షమొక్కటి కలదు. దానికి దాంభికులు కన్నులు మూసికొనుటయే మూలము (వేరు). స్నానముచేసి తలవెండ్రుకల కొనలనుండి రాలు నీరే యాధారము. శుచియే (ఆచారమే) పుష్పములు. వారనుభవించు సుఖశతమే శాఖలు. వ్రతనియమములచే బకదంభము, నవయవములు ముడుఁచుకొనియుండుటచేఁ గూర్మదంభము, కన్నులు త్రిప్పుచుఁ

ూచుటచే మార్జాలదంభమునని దంభము మూఁడు తెఱంగులు గలది. బకదంభమునకు దంభపతియనియుఁ, కూర్మదంభమునకు దంభరాజనియు మార్జాలదంభమునకు దంభచక్రవర్తి యనియు మూఁడుపేరులు గలవు. విూసములు గోళ్ళు తీసివైచి పిల్లజుట్టు పెట్టికొని జడలుదాల్చి గడ్డముపెంచికొని మన్నుపూసికొని యెక్కుడుమాటలాడక పాదుకలు తొడిగికొని పెద్దముడిగల పవిత్రమును వ్రేలనిడుకొని చేయి స్తంభించినటుల నొకగుడ్డపీలికతోఁ జాకలోని కెత్తికట్టుకొని, వ్రేళ్లువెడల్పించుచుఁ జేతులాడించుచు వృథావాదము లొనర్చుచుఁ బకునివలె నడుచు వీథులయందు ధ్యానపరునివలెఁ బెదవులు గదలుచు స్నానము చేయుచు నభినయయుక్తముగ నాచమనము చేయుచు మాటిమాటికి ముక్కు మూసికొనుచుఁ జెవులుస్పృశించుచు "స్సీ"ప్పని పెదవులతోఁ ఏల్చి సీత్కారము చేయుచుఁ జలిలో స్నానము చేయుచున్న తన ప్రభావమును బ్రకటించుకొనుచుఁ బెద్దబొట్టు పెట్టుకొని సర్వోపచారదేవపూజ చేయునట్లు సూచించుచుఁ బుష్పాల శిరస్సునందుంచుకొనుచు నీరీతి నెవ్వరు వర్తింతురో వారందఱు దాంభికులని తెలిసికొనుము. గుణరహితునకు వినయముఁ జూపుచుఁ గుణవంతులయొద్ద మ్రానువలె నుండి బంధువులతో విరోధించి యితరులను గరుణఁ జూచుచుఁ బేరుపొందఁ గోరువాఁడు ధూర్తుఁడగు దాంభికుఁడు. తన కొకరితోఁ బనిగలిగినపుడు వినమ్రభావము గనఁబఱచుచుఁ వేలకొలఁది చాటువాక్యములం బొగడ

చుఁ గార్యానంతరమున బొమలు ముడిపెట్టి చూచుచు మౌన ముఁ దాల్చినవాఁడు క్రూరుఁడగు దాంభికుఁడు.

పూర్వజన్మమున దేవతల నడుచు రాక్షసుఁడై యుండిన జంభుఁడే యీభూలోకమునఁ బ్రాణికోటిలో దంభుఁడై నివసించెను. శుచిదంభుఁడు, శమదంభుఁడు, స్నాతకదంభుఁడు, సమాధిదంభుఁడు, నిస్పృహాదంభుఁడు నని యైదుగురు కలరు. వారిలో నిస్పృహాదంభునితో శతాంశమైనను దక్కినవారు పోలరు. ఆచారమిట్లు చేయవలె నిది యాచార మిది యనాచార మను వాదము లొనర్చుచు, మృత్తికతో శుద్ధులు చేసికొనుచు బాంధవస్పర్శకలిగి లోకమునకు విరోధియగువాఁడు శుచిదంభుఁడు. సమస్తశక్తులు లోననడంచుకొని పైకి శాంతునివలెఁ గార్యార్థియై కాచుకొనియుండి దిక్కులేనివారి సొత్తును దనయింటఁ బడవైచుకొనుటకై యత్నించుచు సర్వభక్షకుఁ డగు బడబాగ్నివంటి యహింసాదంభుఁడును గలఁడు. తలబోడిచేయించి, జడలు దాల్చి, దిగంబరుఁడై, గొడుగు, దండము, కాషాయవస్త్రములు, బూదిపూఁతయుం గలిగి తానుబోయిన చోటనెల్ల భోగించువాఁడును దంభుఁడే. స్థూలశరీరములు గలిగి బట్టతలలకు సేలువులుచుట్టుకొనియు శుష్కదేహములు గలిగి కుచ్చుపాగాలు జుట్టియును గొందఱు దంభముం బ్రకటింతురు. దంభునకుఁ బూర్ణమగులోభమే తండ్రి, మాయయే తల్లి, యసత్యమే తోఁబుట్టువు, కుటిలాకారమే యిల్లాలు, మఱియును నహంకారమే పుత్రుఁడు.

భగవంతుఁడు తొల్లి పదునాలుగుభువనములను వానివా నికిఁ దగిన భూతకోటిని సృజియించి పనితీరి తీరికగాఁ గూర్చుండి యొక్కవాఁడు దివ్యదృష్టిని మనుష్యలోకముపైఁ గటాక్షవీక్షణములను బ్రసరింపఁ జేసి వారు న్యాయమార్గప్రవర్తకులై, ధనభోగాది సంభారముం బోగుచేసికొనక నిరాధారులై యుండుటం జిత్తగించి క్షణకాలము కన్నులు మూసికొని మాయామయమగు సమాధినుండి నరుల యైశ్వర్యవృద్ధికై యీదంభు నుత్పాదించెను. ఈదంభుఁడు, దర్భలు, పుస్తకము, మాల, నీరులేనికమండలువు, తనహృదయమువలెనె కుటిలమగు కొమ్ము, దండము, కృష్ణాజినము, గడ్డపాఱ, పెద్దముడి గలపవిత్రము చెవినొకటి వ్రేలనొకటియుఁ, బిల్లజట్టులో దర్భతోఁ గట్టిన తెల్లనిపువ్వు, నిక్కపొడిచిన కంఠము, జపించుచున్నట్లు నటించుపెదవులు, యోగముపట్టినట్లు మోడ్పుఁగన్నులు, త్రిప్పుచున్న రుద్రాక్షమాల, మట్టితో నిండించిన పాత్రమును గలిగి నేత్రాంచలములఁ గోప ముబుకుచుండఁ గనుబొమ్మలు ముడుచుచు మాటలాడకున్నను దనలోని యభిప్రాయమును వెల్లడిచేయుచుఁ దా నపు డున్నది బ్రహ్మసభాభవనమైనను నందుఁగల మానులు తన్నుఁ ముట్టుకొందురేమో యని శంకించుచు బ్రహ్మదేవునియెదుట నిలువంబడి కూర్చుండఁ బీఠమును వెదకుచుండెను. అతని గొప్పవేషముం గాంచి మోహపడి సప్తమహర్షులుఁ గూడ నమస్కరించి నిలువంబడిరి. వానిం గాంచి తాను లీలార్థము సకలవిధప్రపంచమును బుట్టించినవాఁడైనను విస్మయహర్షములలో మునింగి కొంతసేపు విధాతయుఁ గదలిక

లేకయుండెను. ఆదంభుని దాంభికాకారముం దిలకించి నిజమైన తపశ్శీలాదికములు గలయతం డనియుఁ దాను తక్కువవాఁడ నని యు భ్రమలో మునిఁగి యగస్త్యుఁ డాశ్చర్యపడసాగెను. తనతపం బాతనియెదుట నల్పంబగునని వసిష్ఠుండు సిగ్గుపడెను. కౌత్సుండు తనసరళవ్రతమును నిందించుకొనెను. నారదుండు తనయదాంభి కవ్రతమునం దనాదరము కనఁబఱచెను. జమదగ్ని మోఁకాళ్ల నడుమఁ దలఁబెట్టుకొనియెను. విశ్వామిత్రుఁ డుక్రోషపడెను. గా లవుఁడు భృగువుఁ దలవాంచికొనిరి. వీరిట్లుండ దంభుఁడు దేవుని పద్మాసనముపై నతిప్రౌఢదృష్టిని నిల్పి సగర్వముగా గొంతుకను గ్రుచ్చినట్లు కదలకుండ నిలువంబడఁ బరమేష్ఠి దంభుతోఁ దన దం తకాంతులధావళ్యమున నిజవాహనంబగు హంసను పరిహసించు న వ్వుతోఁ "పుత్రా! రమ్ము నాపీఠపైఁ గూర్చుండుము. నియమ నము వలనను గుణగణ గౌరవములవలనను నీవు నాకులకుఁ దగిన వాఁడవు." అని నిస్సందేహముగఁ దన యూరువును తడిచేతితోఁ దుడిచి శుద్ధిచేసిన, బ్రహ్మపీఠపై నతిక్లిష్టముగా దంభుఁడు కూ ర్చుండి "అయ్యా! నీవు గట్టిగా మాటలాడకుము. ఏమైనఁ జెప్పఁ దలఁచినచోఁ జేతితో బాగుగ నోరుమూసికొని పలుకుము. అట్ల యిన నీనోటిగాలి నాకుఁ దగులకుండును. అట్లుచేయకుంటివా నేను మైలపడుదును." ఇట్టని నిర్భయముగా నుడువ సరస్వతీనా థుండు వాని శౌచమునకు మిగుల నాశ్చర్యపడి చిఱునగవుతో "నిజముగా నీవు దంభుఁడవే" యని చేయి యాడించి "లెమ్ము, నీవు భూలోకమున కేగి నిఖిలజలనిధివేష్టితమైన భూమండలమంత

టి దేవతలకైనను దానితత్త్వము తెలియశక్యముగానంత భోగము
ను యథేచ్ఛముగా ననుభవింపు"మని సాదరమునం బలుకంగా
సంసారసాగరమున నున్నవారి మెడకుం జట్టురాయిగట్టుటకై నర
లోకమున కాదంభచక్రవర్తి యవతరించెను. పిమ్మటం దనకు వా
సయోగ్యమైన స్థానమునకై నగరములం బల్లెలు వనములం బ
ర్వతములం దిరుగుచు గౌడదేశముంజేరి, జంబూద్వీపములన్ని దిక్కు
లను బాలించి యనంతరము బాహ్లికదేశవాసుల మాటలలో
ను, దూష్యవాంటివారి, దాక్షిణాత్యుల ప్రతినియమములలోను,
కీరరాష్ట్రీయుల యధికారములోను గౌడదేశమునం దన్నింటిలో
ను దంభుండు ప్రవేశించెను. శ్రాద్ధములు పెట్టించువారు, సిద్ధమూ
ర్తములు వాల్చువారు, ప్రాతఃకాలమున భస్మత్రిపుండ్రము లుం
చుకొనువారు, పితరులకి సాహాయ్యకులు. పిమ్మట సతీక్షేత్రముగాం
దనశిష్యులను బ్రతిచోటికిని బంపి తానుమాత్రము మూర్తిమం
తుండై మతాధిపతుల నోళ్ళలోం బ్రవేశించెను. తర్వాత గురు
వుల హృదయములందుం, బిదప శిష్యుల మనస్సులలోను, వె
నుకం దపస్సుచేసికొనువారియందుం, కుటిలులగు నియోగుల
యెడందలయందు ననంతరమున దీక్షితుల కుక్షియందును జేరి
పదపడి వరుసగ లెక్కలువ్రాయువారు, వైద్యులు, సేవకులు, వ
ర్తకులు, కంసాలులు, నటులు, భటులు, సంగీతముపాడువారు,
పలుకుంబడికలవారు, చారులుమొదలగువారిలో నివసింపసాగె
ను. చిట్టచివరకుం దనయంశములంగొన్నిటిని బక్షులలోను వృక్ష
ములలోను మృగములలోను జొన్పెను. చేంపలను బట్టుకొను

టకై తపమొనర్చిన ప్లాకకాలిపై నీటిలోఁ గొంగ నిలుచుండుటఁ మనమెఱుంగుదుము కావున దానియందు దంభచిహ్నమున్నద నుటకు సంశయములేదు. జడలు (ఊడలు) వల్కలములు (నారలు మొదలగునవి) ధరించి యెండకుఁ జలికి వానకు సహించి చెట్టొందుకునిలుచును. దానికి పేరుకావలయును గావున. అదియును దంభునిమహిమయే. ఈరీతిగా నాలోచించితిమా దంభుఁడు సమస్తపదార్థములందు నున్నాఁడు. ఆరహస్యమును గనుఁగొన్నమానవుని యొద్ద నెవ్వరిమాయలును బనికిరావు. దంభవికారముగల వంచకులందఱికిఁ జక్రవర్తి యగు వామనదంభుఁడగు శ్రీహరి త్రిలోకములను మూఁడడుగుల క్రింద నాక్రమించుకొన్నది యెవ్వరెఱుఁగని విషయము.

---

## ద్వితీయసర్గము.

లోభుని జక్కఁగా గనిపెట్టవలయును. ఏమన:—లుబ్ధుల వలనఁ బ్రతిచోటను భయముకలుగుచున్నది. లోభాకృష్టునకుఁ గార్యాకార్యములు బొత్తిగాఁ దెలియవు. మాయగల్పించి యొక వస్తువుఁజూపి యింకొక వస్తువు నిచ్చుట, మోసపుచ్చుట మొదలగు విచిత్రములు లోభము వలననే కలుగుచున్నవి. సత్త్వశమ తపసాదులుగలిగి సత్త్వధనులగు శాస్త్రవేత్తల కోడిపోయి లోభుఁడు కుటిలమగు వణిజుల హృదయగర్తమునందు దాఁగికొనియెను. కావుననే యమ్మునపుడు కొనునపుడు దొంగతూనికలు

షూఁచి ధనమార్జించుచున్నారు. ఈపగటిదొంగలు, జనులను మోసపుచ్చి సంతసించుచుందురు. వివిధాన్యాయములుచేసి దిన మంతయు ధనము నార్జించి కోమటి యింటికడ మూఁడుగవ్వ లు దాన మిచ్చుట కతిదుఃఖపడును. పుణ్యకథలు వినుటకుఁ బౌరాణికుని యొద్ది కెంతయో శ్రద్ధగాఁ బోవునుగాని దానధర్మ ములు చేయఁబోవునపు డీతఁడు నల్లత్రాఁచు గఱచినవానివలె మూయమగును. ద్వాదశి, అమావాస్య, సంక్రమణము, సూర్య చంద్రగ్రహణములు వచ్చినపుడు చక్కఁగా స్నానముచేసినను గ వ్వయైన నొక్కనిచేతిలోఁబెట్టఁడు. ఏమైన నిచ్చెనేని మరల నెవ్వరు గాని వత్తురని భయపడి దిక్కుదిక్కులు చూచుచు ముసుఁగు వేసికొని రాజమార్గమును విడిచి సందుఁబడి దొంగవలెబాఱి పోవును. ఈవర్తకవరాని యంగడిలోఁ గూర్చుండి యున్నపుడు యాచకులు పిలిచినం బలుకఁడు, చేతిలో సొమ్ముపెట్టుకొని కొన వచ్చినవానిం జూచి లేచి నమస్కరించి కుశల మడిగి కూర్చుం డుటకుఁ బీఁటవైచి వానితో ధర్మకథలు చెప్పును. సొమ్మప్పుపడి యున్న యొక్క సంసారి వచ్చి యీవలసినదాని నాకోమటి కిచ్చి "యేనుజనుచున్న వాఁడను. నీకప్పుతీఱినది జెపు మరల, విష్టిది నము వచ్చినది, ఏమిచేసెదవో" యనఁ గొంచెము ముఖవికాస మగపఱచి యాసెట్టి మిథ్యాదుఃఖము నటించుచుఁ గార్యాంతర మున దృష్టిపఱపి యెవ్వరితోనో పనియున్నట్లు వెనుకముందు లు చూచుచు "నభ్యంతరమేమి, యీయంగడి తమదే, కాని యరువు పెట్టినచోఁ గష్టము, కాలము తాఱుమాఱుగానున్నది.

మీచిత్తము ! మీదాసుఁడను. తమరుఁగూడ నెఱుఁగుదురు భ
ద్రాకరణమువచ్చుచున్నది. కావున నప్పటి కష్టంబులన్నియుఁ బోఁగు
చేసికొనవలెను. నిన్నఁటినాఁడుస్నేహితుఁ డప్పుతీసికొన్నను భ
ద్రాకరణము వచ్చిననాఁటి కేకితినో బతిమాలి సొమ్ము నడిగిపు
చ్చుకొని యింటికిఁదెచ్చి యామొక్కనాఁడు నుంచుకొని మర
లఁ బంపివేయుచుందును. వర్తకసరణియిది" ఇట్లని రహస్యము
గా సత్యకాలపువారియొద్దనసంబద్ధపుమాటలను బలికి ధనమును
జల్లగా నాపాపి క్రయవిక్రయ సమయములందు గడించి నిధు
లు నుపనిధులంగూర్చి కుబేరుని నవ్వుచుండును. లుబ్ధులైనవణిజు
లాకీతిగాఁబోగుచేసినధనరాసులు భోగాదిసద్వినియోగమున కు
పకరింపక బాలవిధవల స్తనములవలె దుఃఖభాజనములై యెం
దుకు నుపయోగింపక నశించును. సంసారు లన ప్రాఁతయిండ్లను
గుల్లచేయు పందికొక్కులవంటి వర్తకులు తాము తినక యొ
కరికిఁ బెట్టక గడించిన ధనమును రక్షించుకొనుటయందే గుండె
దిగులుతో దినములు నెట్టుచుందురు.

అకటావికటముగా నోడలునిండ గుడ్డలతోఁ జుట్టఁబెట్టు
కొని స్ఫటాటోపముగా ముళ్లకంచిలోఁ దిరుగు పామువలెఁగుటి
లస్వభావము గల పురపతి యను నొక ధనవంతుఁ డగుకోమ
టియుండెను. అతనియొద్ద నొకసంసారి తనయింట నున్నధనమం
తయు దాఁచఁబెట్టి దేశాంతరముపోయి దైవవశమున నష్టములను
బొంది స్వజనముం బోఁగొట్టుకొని దరిద్రుఁడై తనగ్రామమునకుఁ
దిరిగివచ్చి యొకపురుషుం జూచి "అయ్యా! మున్నిక్కడఁ జిన్న

యుంగవి పెట్టుకొను పురపతి సెట్టి కనఁబడఁడేమి యెక్కడి కే
గినాఁ" డని యడిగెను. "ఇపుడతఁ డధికైశ్వర్యముతోఁ దుల
దూఁగుచున్నాఁడు. మునుపటివలె లేఁడు; బంగారు, వస్త్రములు,
కస్తురి, చందనము, కప్పురము, మిరియములు, పోఁకలు, నేల
కులు మున్నగు పదార్థములు సమితముగఁ బెట్టుకొని మహా
ప్రాకారములలోఁ గోట్లకొలఁది ధనములు గణించుచు నాయెదుటఁ
గనఁబడు కృత్రిమచిత్రంబులగు భిత్తులు గల మేరుపర్వతమువంటి
విశాలభవనమున నున్నాఁ" డని యాపురుషుఁ డుత్తరము చెప్పి
పోయెను. ఆమాటలను విని యాదరిద్రుఁడు మిగుల విస్మయము చేఁ
దలయూఁచి యావర్తకుని మేడకుం జని గృహద్వారముకడఁ
గదలకుండ స్తంభమువలెఁ జింపిరి గుడ్డలతోఁ జాలసేపు నిలువం
బడెను. ఆనిలిచినవానిని సౌధముమీఁది గవాక్షములద్వారా
శ్రేష్ఠిగారు చూచి గుర్తించి యూపిరి తిరుగక చేష్టలుడిగి వజ్రా
యుధము నెత్తిమీఁదఁ బడినట్లుండి యించుక తాళి మెల్లఁగ
నెవ్వరును బరులు లేని సమయముం జూచికొని క్రిందికి దిగి
వచ్చెను. వెనుక నేను దాఁచఁబెట్టిన నాసొమ్మిప్పింపుమని యా
దరిద్రుఁడు తనపేరు చెప్పి వేఁడుకొనియెను. ఆపలుకులు విని
కోమటి, కనుబొమ్మలు ముడివైచుచు, దిక్కులు చూచుచుఁ,
జేతులాండించుచు, వంచకవచనము లాడుచు "వృత్తిక్షీణుఁడగు
నీపాపాత్ముఁ డెక్కడనుండి వచ్చినాఁడో! ఓయీ! నీ వెవ్వరు,
నీ వెవ్వరికెప్పుడేమియిచ్చినావో! నీముఖమైనఁ జూచినట్లు నాకు
స్మరణకు రాలేదు. మాటలతోఁ బ్రయోజనములేదు. అక్కటా!

ప్రహారము! కలికాలమహిమ! ఏఁ బెట్టినాఁడో చూడుఁడు! నాయొద్దనుండి ధనము గొనఁదలంచుచున్నాఁడు. ఏనిసంగతికని పెట్టినారా! మేము హారదత్తునివంశ్యులము, మావంశమువారు దాఁపుడుధనమును బుచ్చుకొనుటయే లేదు. అట్టివారిమీఁదికి దాఁచఁబెట్టినది హరించినారను మహాదోషముగూడఁ దగులుచున్నదా! నీ వేనాఁడిచ్చినావు? అతికి జ్ఞాపకముండెనేని నాఁటి మాలెక్కలపుస్తకములో నాయవ్యయములను నీవే చదువుకొమ్ము. నేను ముసలివాఁడను, గాఁబట్టి, పుత్రునిపై సంసారభారమును బెట్టి పద్దులమాత్రమే వ్రాయుచుందు" నని నిరాకరింపఁ గోమటి కొడుకుదగ్గఱకుఁ బోయి తనసంగతి చెప్పుకొనెను. మాతండ్రియేఁ గాని యే నెఱుంగనని పుత్రుఁడును, బుత్రుఁడే గాని యే నెఱుంగనని తండ్రియు రాకపోకలచే నాదరిద్రుని బంతివలె నాడించిరి. ఏమియునాధారము కానఁబడక దుఃఖించుచు నాతఁడు రాజుగారియొద్ద మనవిచేసికొనియెను. సెట్టిని బిలిచి ప్రభు వెంతయడిగినను జెప్పక కోపపడినను సహించెను, బాధపెట్టిన నోర్చుకొనెను, పెక్కులగు యాతనలం బెట్టినను ధైర్యము విడువలేదు, ప్రాణమువిడుచుటకైన సిద్ధపడెనుగాని రూకలో నొక్కభాగమైన నిచ్చుట కొడంబడకుండుటయే గాక నా చేతికిఁ గించిత్తయినను దాఁచ మని యీతఁ డీయనే లే దనియెను. ఈరీతిగా స్వభావలుబ్ధులు, ధన మను సముద్రపునీరుం ద్రాగు నధికతృష్ణగలవారును దృణప్రాయముగ శరీరమునైన విడిచెదరు గాని విత్తములేశమైనను విడువరు.

పూర్వకాలమున ధనాధిపతి యగుకుబేరుని యొద్దికి బాల్యస్నేహితుఁ డగు శుక్రుఁడు వచ్చి "దేవదానవులయైశ్వరములనన్నింటిని మించిన నీయైశ్వర్యము విరోధులకు దుఃఖమును మిత్రుల కుత్సాహమును గలిగించుచున్నది. విత్తనాయకుండగు నీయట్టిచెలికాఁడు నా కుండియును నేను గుటుంబభారమును మోయలేని దరిద్రుఁడనై యుంటిని. సుఖదుఃఖములు రెంటియందును బనికివచ్చువానినే స్నేహితుఁ డందురు. యశస్సంపాదనపై నాదరము గలవారు నరులఁ బోషించువారు సద్వంశజులు నగుమహాత్ములసంపద నేస్తుల కుపయోగింపఁబడ వలయును. బహుపుణ్యపరిపాకమున లభించి భద్రముగా రక్షింపఁబడుచుండు ధనమును జెలియు సంకటసమయమున విపత్తునందుఁ గూడ నాధారము." అని నమస్కరించుచు నెవ్వరు లేనిసమయమునఁ జెప్పుకొనఁగాఁ గుబేరుఁడు, స్నేహలోభములు రెండును బెనఁగొని తన్నురికట్ట "బాలమిత్రము నిన్నెఱుంగుదును నీకును నాకు మిగుల స్నేహంబు గలదు. కాని ప్రాణములైన విడిచెదం గాని ధనలేశమైనను విడువ సమర్థుఁడనుగాను. స్నేహితులు, బంధుగులు, మిత్రములును, భార్యలుఁ, బుత్రులుఁ గార్హ్యవశమునను వలసినప్పుడును జాలమంది దొరకెదరు, లోకమునందు ధన మట్లు దొరకునా! అర్థులకు దానము చేయుట యతిసాహసము, నతిదుష్కరము, మఱియు నత్యాశ్చర్యము. జీవనములైన నిచ్చెదం గాని ధనము మాత్రమైన ధనము నీఁజాలను." అని యాశాభంగకరము లగువాక్యములు పలికిన శుక్రుఁడు

తలవాంచి కుందుచు నింటికిం జని మంత్రులతోడ నాలోచించి కుబేరుని ధన మంతయు మాయచే నపహరింపవలె నని యాతని హృదయముం జొచ్చెను. శుక్రుఁడు ప్రవేశించుటచే విత్తపతి శుక్రునిచే నియమింపఁబడిన బ్రాహ్మణులకుఁ గలధన మంతయు నత్యద్భుతత్యాగముం గావించెను. ఇట్లు సకలధనము హరించి శుక్రుఁడు చన జరిగినసంగతి యంతయు ధననాథుఁడు గ్రహించి శోకించుచు మొగముపైఁ జేతులునైచుకొని శంఖాదు లగు నిధులతోఁ గూడ విచారించి వేఁడి నిట్టూర్పు విడిచి "సుహృదుఁడు, మాయావి, యతిలుబ్ధుఁడు, ధూర్తుఁడు, రాక్షససహాయుఁడు నగు నాచుట్టంతయుం దెలిసిన శుక్రునిచే మోసపోయితిని. ఇప్పుడు వానిచే నిర్ధనుండనై గడ్డిపరక కంటెను దేలికవాఁడ నైతిని. ఎవ్వరితో నాదుఃఖముం జెప్పుకొందును. ఎక్కడికిఁ బోదును, ఏమిచేయుదును. ధనరహితుం జనులు విడిచిపెట్టెదరు. జనరహితునికిఁ బరాభవము కలుగును. పరిభవింపఁబడినవానికి దుఃఖభారము మెండగును. మనుజునికిఁ బ్రేమాస్పద మయిన ధనము పోయినచోఁ బ్రాణములుకూడఁ బోయినట్లే. విద్వాంసుఁడు, సుభగుఁడు, మానవంతుఁడు, విశ్రుతకర్ముఁడుఁ, గుణోన్నతుఁడు, శూరుఁడును విత్తవంతుఁ డేయగును. విత్తహీనుఁడు గుణవంతుఁడైన గుణరహితునట్లు లగును. అని మిగుల వగచి శంకరుని శరణుచొచ్చెను. పూర్వస్నేహితుఁడు విశ్వశరణ్యుఁడు నగు నామహేశ్వరుఁడు శుక్రుఁడొనర్చిన సకలమును గుబేరునివలన విని యాతనికై దూత నంపి పిలిపించెను.

శీఘ్రముగా దూతతోఁగూడ వచ్చి యంజలి బంధించుకొని నిలిచిన ధనప్రభావిశముఁడగు శుక్రుని బురారి చూచి "ఈ నీస్నేహితుఁడు కృతజ్ఞుఁడవగు నీచేత వంచింపఁబడినవాఁడు. కృతఘ్నుఁడుకూడ మిత్రద్రోహకార్యమున వర్తింపఁడు. అట్టిచోఁ బ్రాణస్నేహితుఁడు ననురాగముగలవాఁడునగునీతనిపట్టున నీవొనర్చిన వంచనతగనిది. సజ్జనునకు నీవొనరించిన యీపని నీకు శాస్త్రసమ్మతమా, వ్రతయోగ్యమా, వంశానుగుణాచారమా! ఇట్టి గుణములు నీ కభ్యాసమేనా! లేక గురుజను లుపదేశించినారా! నీనైజగుణమా! నీబుద్ధివైభవమా! యెట్లు నేర్చికొంటివి. ధన మెవ్వరికిఁ బ్రియముకాదు! ఎవ్వరికి ధనమువలన సంతసముపుట్టదు! అయినను యశోధనాభిలాషులు మాత్రము దుష్కార్యములచే ధనమును గ్రహింపరు. అతులము విమలము నగు భృగుకులమును లోభగుణముచే మలినము గావింపకుము. యశోరాజహంసకు లోభమేఘము శత్రువుగా నెఱుంగుము. అనంతమగు కీర్తిని విడిచి యనిలాకులతృణలవోపమాన మగు ధనము నెవ్వఁడు గ్రహియించునో యాతనికంటె ధూర్తునిం గానము. సాధువృత్తిని విడిచి కుటిలబుద్ధిచే నెవరిం దాను వంచించునో వానిచేతనే తనపూర్వసుకృతము హరింపఁబడును. దూషితయశుల సహజకోమల మగులక్ష్మి యపవాదతనుజనిత మగు గాటువాసనచే మూర్ఛపోవును. సత్పురుషుల విశదమగు కీర్తిపటికంపుటద్దంబులు పరిభవదుఃఖితజననిశ్వాసముచేఁ గళంకితములు కాఁగలవు. అతిమలినము నసమంజసముగా నీవు సంభ

వించిన దుర్వ్యాళమును బయలవిత్తము విచ్చివేసి పోఁగొట్టుకొను
ము. విమలయశోవనమునకుఁ బట్టుకొన్న యపవాదఘూర్ణిని నిస్పృహా
స్తములతోఁ నుడిచి వేయుము. నామాటలు విని పసులధనము
ను బయల కిచ్చివేయుము." అని యెంత చెప్పినను పరధనవిత
తృష్ణచేఁ జేతులు జోడించుకొని శుక్రుఁడు త్రిభువనగురునితో
"భగవంతుఁడా! యమరేంద్రకిరీటకోటిపై విహరించు నేలిన
వారి శాసనమును సత్త్వహీనుఁడు దుర్గతిం బొందఁ గోరువాఁ
డుఁగాఁ డేని నెవ్వఁ డుల్లంఘించును. ఏదరిద్రునిగృహంబున భృ
త్యులు, భార్య, సుతులు మ్రగ్గుచుందురో వానికిఁదక్కఁ
గార్యాకార్యవిచార ముడిగి మఱియెవ్వనికిఁ బరధనము హరింప
బుద్ధి వొడమును! ఈకుబేరుఁడు బాలమిత్రుఁ డని యాపద
క్కక్కఱకువచ్చు నని దినదినము ప్రతీక్షించుచుంటిని. నాహృదయ
మున నాశయము బిక్కిలిగా నుండెను. ఒక్కనాఁ డేను సిగ్గు
విడిచి యాచించినను వికటముగా నవ్వి నేఁడు లేదు లేదను
కత్తికోఁతలచే నాయాశను దెగఁగొట్టివైచెను. ఆశాభంగము
గావించుటకు మున్నె గత్తికోఁతకు వచ్చుటు, నిప్పులేకుండఁ
గాల్చుట, [illegible] జంపుట [illegible]టిని. కావున నాకీ
కుబేరుఁడు శత్రువు. శత్రుని వంచించుట సుకృతసమానము. దరి
ద్రుఁడు [illegible] బొందఁడు.
మీరాదు [illegible] సనముగాఁ దెలిపినను [illegible]మైన ధనమును విడువఁ
జాలను. [illegible] శ్రేష్ఠము. [illegible]
ప్రాణత్యాగము జరుగును." అని మఱియు మఱియుఁ బ్రార్థించినను

డనమాటవినలే వను క్రోధముచే మహాదేవుఁడు శుక్రుని మ్రింగివై
చెను. ప్రళయాగ్నిభీకర మగునీశ్వరజఠరానలమునం బడి యొ
డలు కాలుచుండఁ బెద్దబొబ్బలువెట్టు నాభార్గవునితో సుమార
ముణుగాడు ధన మిచ్చివేయు మని నొక్కినొక్కి చెప్పెను. నాశన
ముం బొందినఁ బొందుదుం గాని ధనమును విడువఁ జాల నని
శుక్రాచార్యులు నిరాకరించెను. పిమ్మట ధారణావిశేషంబున
గంగాధరుండు జఠరానలంబుఁ బ్రజ్వలింపఁ జేసి బాధించి యా
దుర్గ్రహాదగ్ధ మగుపరులవిత్తమూ నిచ్చివేయుము, నాయుదర
మహోదధిం గల బడబాగ్నిం బడి నశింపకు మని యొంత చెప్పి
నను నతిశయతాపముచే శరీరము దగ్ధము యిన నగుంగాక యేను
ధన మించుకంతైన విడువ నని శుక్రుఁడు చెప్పి జ్వాలజ్వాల
లంతకంత కెక్కువ యగుటచేఁ దాళఁజాలక స్వల్పాయుష్యుఁ
డై దేవీస్తవము గావించెను. ఆస్తోత్రమునకు మెచ్చినగౌరినాథు
నికరుణావడసి యుద్ధరింప నారుద్రుని శుక్లద్వారమునన తఁడు వెలు
పటికి వచ్చెను.

ఇట్లు స్వభావము చేతనే లుబ్ధులగుజనులు తీవ్రము
లగుబాధలనైన సహింతురు, గాని, యధములవలె సహజకౌటి
ల్యమును విడిచి విత్తమును గొంచెమైనను విడువఁజాలరు. కా
వున లోభమువలనఁ గుటిలస్వభావముగలిగిన కపటకల పొడమి
లోభిష్ఠారిమనస్సుల నివసించుచున్నది. వారు లోకమును వంచిం
చుచున్నారు. లోభగుణము లేనివారు వంచింపలేరు.

---

## తృతీయసర్గము.

కామము సౌందర్యాతిశయము కలదగుటచే నత్యంతము మోహమును బుట్టించుచు మాధుర్యము కలిగిన విషమువలెనే విషమముగా నతిశీఘ్రమునఁ బ్రాణములను హరియించుచున్నది. సూచితదానులుఁ బరిమలలీనాలివలయహుంకారులు నగు కామకలితగజేంద్రు లబలలచే నతిశీఘ్రముగా బాధింపఁబడుచున్నారు. స్త్రీలపాదాఘాతంబు లనునంకుశములపోటులకును బంధనములకును, విషయముషితంబును స్మరవంచితంబు నగు కామగజేంద్రము సహించును. స్మరవంచితుఁడు సహింపలేని దేది! విషయవివశుఁ డగుమనుష్యుఁడు దీర్ఘవ్యసననిరుద్ధుఁడు, భ్రూభంగజ్ఞుఁడు నై స్త్రీలకు వశంగతుఁడై వారిచేతఁ గేహమయూరము వలె నాట్యముచేయింపఁబడును. రక్తాకర్షణసక్త లగు మాయావినులు మోహాంధకారరాత్రులయందు ముగ్ధులహృదయములను బిశాచికావితతివలె హరించుచున్నారు. అనురాగవంతులకు వలలవంటివారు, మనోగజమును బంధించు గొలుసు లట్టివారు, వ్యసననవపుష్పగుచ్ఛములఁ బోలినవారు నగు మానినులకు వశుఁడైనవానికి ముక్తిలేదు. సంసారచిత్రమాయలు, శంబరాసురుని మాయలు విచిత్రియను రక్కసి మాయలు నెఱిఁగిన జితాత్ముఁడు కూడ యువతీజనులమాయల నెఱుంగఁ జాలఁడు. కుసుమసుకుమారదేహలు, వజ్రకఠినహృదయలు, విచిత్రచరిత్రలు నగు నంగనలకు నిజముగ నెవ్వరిమీఁదను బ్రేమ యుండదు. అనురక్తులపై విరక్తి, విరక్తులపై ననురాగము, నమ్ముల

యుండుఁ దృణీకారభావముం గలిగి, వంచనావచనప్రియ లగు వాఁడు వారికి సద్భావముండు ననుట సంశయమే. బహుజనదృష్ట విలాసకుటిలాంగి, ధైర్యధ్వంసపతాకయు నై కలికి యెవ్వనియిం టనుండునో యాతని కది యధిపురాలుగాని యిల్లా లెన్నఁటికిని గాదు. మన్మథవికారములచే జయింపఁబడి, నష్టచేష్టుఁడై మూఁగవానివలె నింటనున్న మగవానికి మగువ నోటమన్నగొట్టుట నిశ్చయము. అపరిస్ఫుటాక్షరములు గలుగునట్లు కామకలచే వాక్యములను బంధించి స్వభావముచే నేమియు నెఱుఁగని ముగ్ధవలెనే ప్రౌఢాంగన పెనిమిటిని దనకుఁ దిలకముక్రిందఁ జంద్రునిఁ దెమ్మని దొంగయాచనచేయును. ఇచ్చవచ్చిన ట్లనవరతముఁ దిరుగుటలో మొద్దుదేఱిన కామినిపాదములను విలాసవిజితుఁ డగుమగవాఁ డొక్కనారి తాను దీర్ఘదర్శనమునకుఁ గానిపోయి నొచ్చెనేమో యని స్వయముగాఁ బట్టి యొత్తును. కనుసంజ్ఞలచే నొక్కరీతి, మాటల వేఱొక్కభంగి, చేష్టలలో నింకొక్క కైవడి, సురతములం దొక్కకరణిని నటించు స్త్రీలు సహజముగ వేసగత్తెలవంటివారు. నిజపతిచపలకురంగి, పరతరుభృంగి, స్వభావమాతంగి, మిథ్యావిభ్రమభృంగి, కుటిలభుజంగియు నగుస్త్రీ యెవ్వనికి సొంతము? పలువెఱుంగుల బహువిధయావనులతోఁ గూడి యనవరతము నుండుఁగాన వేశ్యజన్మ ముత్తమ మైనదని వారి నిట్టూర్చుచు నిర్జనస్థలమున నిచ్చలుఁ జింతించుచుండును. చపలయగుమగువ హర్మ్యంబుపైఁ గూర్చుండి దారింబోవువారిఁ గాంచుచు గీతములు వాడుచుఁ బరువులెత్తుచు నకారణముగ

స్ఫటికాక్షమాలవంటి నవ్వులను నవ్వుచుండు. నాపతి పరుప్రాయుఁడు, పలుకను, గావింపను, జేతఁగానివాఁ డని స్వజనములో నుడువుచుఁ బురుషవ్యాపార మంగనయే చేయును. జీవస్మృతుఁ డగుభర్తగలకామిని తానే తనయింటికి వచ్చిన వారి కెకురుగాఁ జనును. వ్యవహారవిషయములలో స్వయముగ రాకపోకల నొనర్చును, గట్టిగా మాటలాడును.

ఈర్ష్యగలది, వృద్ధునిభార్య, సేవకపత్ని, నియోగివనిత, నటునిపడంతి, కారుకర్త చేయు నాతనిగృహిణి, లుబ్ధురాలు, సార్థవాహునిగరిత, గోష్ఠివిహారణస్వభావురాలు, స్వభావము చేఁదరుణులయందు వాత్సల్యముగలయది, పరగుణగణనము చేయునది, తనభర్త దోషము లెంచునది, యల్పధనముగలయామె, భోగాసక్త, రూపవతి, వికారరూపముగలయాతని మగువ, ముగ్ధుని పెండ్లము, సకలకలలు నేర్చినది, నీచస్నేహముగలది, ద్యూతమధుపానములం దాదరముగలది, పెద్దకథలు చెప్పునది, పాటలుపాడు నేర్పు గలది, పుంశ్చలీసహవాసము గలది, శూరవీరప్రసంగములం దాసక్తిగలయామె, యింటఁ బనులు చేయునది, పలువేసములు వేయునట్టిది, సిగ్గులేనిది, యసత్యాలాప, మాటకుమాట బదులు చెప్పునది, ప్రీతిపేశలాలాప, కుశలవార్తానిపుణ, విజనస్థలక్రీడాసక్తయై ప్రకాశమున సాధ్వివలె నటించునది, యాగములకుఁ దీర్థములకు దేవాలయములకు గణకులగృహములకు వైద్యులయిండ్లకుఁ దిరుగునది, భోజనపానాదుల కధికవ్యయము చేయునది, యాత్రోత్సవములు గావించునది, స్వతంత్రురాలు,

భిక్షుకులు తాపసులు వీరింగన్న భక్తి చూపునది, స్వజనులందు విరక్తిగలది, దర్శనదీక్ష గలయది, పతియం దనురాగము లేనిది, సమాధివహించునది మున్నగువారు నష్టచారిత్రలుగా నుందు రని గ్రహింపవలయును. సతతానురక్తదోషలు మోహితజనతా బహుగ్రహాలు నగు సంధ్యలు స్త్రీలు పిశాచికలును రక్తచ్ఛాయాహారిణులు గదా ? స్త్రీలవలలో నెవ్వఁడు పడునో యాతఁడు దాంతుఁడు, బుద్ధిలేనివాఁడు. నీచకార్యమునకై కష్టించుచున్నను దనకుఁ బ్రీతి యున్నకతనఁ బడుచున్న యిక్కట్టులను బాటింపఁడు. అట్టివానిపై నందఱు నధికారులే. శృంగారశౌర్యకత్థనము నసమంజసదానవర్ణనము నను నివియే స్త్రీలను వశపఱచుకొనవలె నన్న మంత్రతంత్రరహితసాధనములు. సహస్రమాయలు గలవారు కలికాలమను చీఁకటి దిరుగు రక్కసులు నగు మానినుల పాపచారిత్రమును విన్నచో నెవ్వరికి దేహములఁ గంపము జనింపదు !

పూర్వకాలమున ధనపతిం దిరస్కరించు విభవముగలిగి సముద్రునివలె రత్నాకరుండై ధనదత్తుం డను విఖ్యాతఖ్యాతిని బడసిన వణిగ్వరుండు గలఁడు. అతనికి మనోజ్ఞైశ్వర్యమూర్తివంటిది, సులలితాంగి, నయనవిలాసముచేత నే దిక్కులన్నింటిని జయించినదియు నగు వసుమతి యనుకన్య కలదు. అపుత్రకుఁ డగుటఁ బుత్రస్థానమున నిలిపిన యాప్రియపుత్రిని ధనదత్తుఁడు వైభవమునఁ గులమున నభివృద్ధినిఁ దనతోఁ దుల్యుఁ డగు సముద్రదత్తుఁ డనువణిజున కిచ్చెను. అత్తవారియింటనే సముద్రదత్తుఁడు

వసుమతింగూడి యుండి యొక్కపుడు ద్వీపాంతరవ్యాపారమున కై చనియెను. భర్త యింటలేనికారణమునఁ జెలులతో నాసెట్టి పట్టి కేళీవనముల సౌధతలముల విహరించుచు మార్గమున నేఁగునొక్క మన్మథాకారుం గాంచెను. ఆతనినిం జూడఁగనే యామె ధైర్య మెక్కడికో కుమతిచేఁ గొపగింపఁజేయఁబడినది వలెనే పోయెను. దానిచే విచారశూన్య మైె స్మరవికారమును గప్పిపుచ్చుకొన శక్తురాలు కాకపోయెను. 'ఓచపలురాల! శీలమును రక్షించుకొమ్ము, కులకూలమును నదివలెఁ బడఁద్రోయకు,' మని చెప్పుదానివలె గంటలయొడ్డాణము మొఱయఁ, జెలిని బిలిచి రహస్యముగ నాతరుణుని వృత్తాంతముం దెలిసికొని తనభవనమునకుఁ బిలిపించుకొనియె. కామినుల చపలచిత్తము నెవ్వరు నిర్బంధింపఁగలరు? కామవికాసములగు సురతవిలాసములచే సహజప్రేమనివాసములగు నర్మపరిహాసములతో నాస్వైరిణి వానిం గలసి యానందించెను. పిమ్మట సముద్రదత్తుఁడు భార్యావలోకనోత్సుకుండై త్వరితముగ వ్యవహారములు చక్కఁబెట్టుకొని మహారంభుఁడై మామగారి యింటికి వచ్చెను. మహోత్సవలీలావ్యగ్రజనులతోడను సంపన్నిచయముతోడనుబగలంతయుఁగడపి రాత్రి దయితాయుతుఁడై విరచితశయనము, బద్ధవితానము, జృంభితసౌరభధూపంబు నై మనోరంజకమణిదీపములతో సురగృహరూపమున నున్న శయనమందిరముం జేరి మధుమదవిలులితలోచనకమల యగు భార్యను నవనలిని నత్తగజం బట్లాలింగనం బొనర్చెను. ఆసుందరి హృదయనివాసి యగు పరపు

రుషుని ధ్యానించుచు యోగినివలెఁ గన్నులు మూసికొని చిరకాల మాతని యొద్దనుండి సంకుచితాంగి యై నిట్టూర్పువిడుచుచు నెందులకు నొదవక పోయెను. ఆముగ్ధుఁడు ప్రణయకుపితురా లయిన దని భావించి చాటువాక్యములతోఁ బాదములపైఁబడి యాచించెను. పరపురుషానురాగిణులుఁ దమయందు విముఖులుఁ బ్రణయకాములు నగు తమభార్యలను మూఢులై పురుషపశువులు రంజింప మొనలు వెట్టుదురు. ఈకామి స్వతంత్ర కాముఁడైనను బరహితకామము కడ నేమి చేయఁగలఁడు. ఘనశోణితరక్త యగు సంధ్యయందు సహజరాగి యగుసూర్యుఁ డేమి చేయుచున్నాఁడు.

ఉపవనకుంజములో గూఢముగా నొక్కచో నుపపతిం దాఁచి తనపతిని విషమ్ముట్లం గని మూర్ఛనభినయించెను. ప్రణయాంతమున నిద్రాముద్రిత నయనుండై సముద్రదత్తుఁడు నిదురింప వసుమతి లేచి యలంకరించుకొని మెల్లఁగఁ బూఁదోఁట పొదలోనికిఁ బోనుండెను. ఇంతలో దొంగ యొక్కఁడు మధుమత్తజనంబగు నాగృహముఁ జొచ్చి గమనోత్సుక యగునాకులాఁడి యాభరణములపైఁ గన్నువైచెను. అపుడు చంద్రుఁడు తూర్పుదిక్కునఁ బొడిచి నిమీలితతారాలింగనమునుం గావించి కమలములు సంకోచపడఁ గలువలు వికసిల్ల రాత్రియనుమగువ కపటహాసమువంటి తనతుహినకిరణజాలముం బ్రసరింపఁ జేసెను. రవిపరితాపశ్రాంతయగు నాకసముం గాంచి కుముదకులము నవ్వుచున్నటు లందలి తుమ్మెదలు హుంకారము చేయఁదొడఁ-

గెను. నిశాకాంత చంద్రకరములచేఁ దన తిమిరకంచుక మపహ
రింపఁబడ లజ్జాన్విత యైనదియుం బోలెఁ గుముదామోదాకులం
బగు నలినవలయపటముం గప్పుకొనియెను. ఆయర్ధరాత్రమున
వెన్నెలలో నందఱు నిదురించుచుండఁ జీఁకటిం బోవలెనే నిశ్శంక
ముగా నెలదోఁటకు వసుమతి చనియెను. వినతయు వినయ
ప్రోషితయు నగు నాకామిని పొదరిల్లు తూఱుచుండఁ జోరుఁడు
ను రహస్యముగ భూషణలోభమున వెంట నంటి యుండెను.
అందు విభూషితంబై యుజ్జ్వలాంశుధారియై కుసుమాంబువులు దా
ల్చి యద్భుతముగఁ బక్షులచే శంకింపఁబడుచున్న ప్రియుని
దేహముం గాంచెను. ఇంతకుముందె యాతఁడు ప్రియురాలు జా
గుచేయుటచే వియోగవహ్నిం గ్రాఁగువాఁడు దిగ్వ్యాపినియగు
కౌముదిచేఁ దగులఁబెట్టఁబడిన హృదయముతోఁ జాలకాలము
సంకేతస్థానమున నిలిచి యిఁక రాదను నిరాశతోఁ జెట్టుకొమ్మ
ల వ్రేలాడు లతాపితానంబున నురివోసికొని ప్రాణములు పోఁ
గొట్టుకొనియెను. ఆ ప్రియకళేబరముం గాంచి గూఢముగా విల
పించుచుఁ దమ్మెదలు రోదచేయుచున్న పుష్పగుచ్ఛము చెట్టు
నుండియుల్లె నేలం బడి పెద్దతడవు సమ్మోహమీలితాక్షియై
భూమిం గౌఁగిలించుకొని లఘుస్వరముతో 'హా! నయనానం
ద! ఎక్కడనుంటివి! నీవిశదేందుసుందరం బగు వదనం బేదీ!
మందపుణ్యురాలను నిక్కడ నేనిచూచుచుంటిని! ఇంక నెక్కడి
కాంతుఁడు!' అని కరుణముగ నేడ్చి యురిత్రాళ్లు విడిపించి యా
శవముం దొడపై నిడుకొని ముద్దుగొని జీవమును బోయుదాని

వలె నోట నోరుపెట్టి యనురాగరూపమువంటి తాంబూలరాగము బ్రకటించెను. అపుడు బేతాళుఁ డొకఁ డాకామిని కునుమోత్కరమృగమదధూపాదిసౌరభముచే నాహ్వానితుఁడై యాశవమునం దావేశించి దాని ముక్కుఁ గొఱికి వైచెను. చాపలోచితంబును దుర్ణయమునకు ఫలము నగుముక్కుఁడిలితనముం గొని యామె నిజగృహంబునకేఁగి హాహాకారముం గావించెను. అందఱును లేచి యేమియని యడుగ సముద్రదత్తుఁడు తననాసికాచ్ఛేదముం బొనర్చె నని యాక్రందించెను. అత్తమామలు మొదలగు బంధువర్గ మల్లుని గోపించి యడిగిన నేమియును మాఱుపలుకక మిన్నకుండెను. ఉదయమున బంధువు లెల్లరు రాజునొద్ద విన్నవించి రాజక్రోధమున కాతనిం బాలుపఱచి ధనాదిదండముం గావింపించిరి.

ఇది యంతయుఁ దనదొంగతనము మానుకొని విస్మయముగాఁ బ్రత్యక్షముగాఁ జూచుచున్న చోరుఁడు రాజసమీపమునకు వచ్చి సత్కరింపఁబడి పూఁదోఁటలోని శవముచు దాని నోటనున్న ముక్కుతునుకను జూపి నిష్కారణము, సుహృదనుచితము నగుశుద్ధిని సముద్రదత్తునకుఁ గావించెను.

ఇట్టి కుటిలతరలుఁ, గ్రూరాచారలు, సిగ్గులేనివారుఁ, జపలలు నగుస్త్రీల నెవ్వఁడు తెలిసికొనఁగలఁడు. మఱియుంతెుఁ డుఁ గూడఁ జెలులచే వంచింపఁబడుట నిస్సంశయము.

---

## చతుర్థసర్గము.

అందునను వేశ్యాకాంతలు మిగులఁ గుటిలురాండ్రు. కుటిలానురాగముచే జనులను హరించుచున్నారు. అట్టివారి కపటచరితమునఁ గుబేరుఁడు కూడ సన్యాసి యగును. బహుల తరంగాభిరామములు నిమ్నగామినులు నయి సముద్రమున నదులవలె వేశ్యల హృదయములందును నఱువదినాలుగు కళలు గలవు. అవి యెవ్వియనః—

వేషకల, నృత్యకల, గీతకల, వక్రవీక్షణకల, కామపరిజ్ఞానకల, గ్రహణకల, మిత్రవంచనకల, పానకల, కేళికల, సురతకల, ఆలింగనకల, అంతరంగజ్ఞానకల, చుంబనకల, పరకల, నిర్లజ్జాకల, వేగకల, సంభ్రమకల, ఈర్ష్యాకల, కలహాకల, రుదితకల, మానసంక్షయకల, స్వేదకల, భ్రమకల, కంపకల, ఏకాంతకల, ప్రసాధనకల, నేత్రనిమీలనకల, నిస్పృహానిస్పందకల, మృతోపమకల, విరహాసహాకల, రాగకల, కోపప్రతిషేధనిశ్చయకల, నిజజననీకలహాకల, సద్గృహాగమనకల, ఉత్సవేక్షణకల, హరణకల, జాతికల, కేళికల, చోరకల, ప్రార్థనకల, గౌరవశైథిల్యకల, నిష్కారణదోషభాషణకల, మూల్యకల, అభ్యంగకల, నిద్రాక్షికల, రజస్వలాంబరకల, రూక్షకల, తీక్ష్ణకల, గళహస్తకల, గృహార్గలార్పణకల, సంత్యక్తకాముకాహ్వానకల, దర్శనకల, యాత్రాకల, స్తుతికల, తీర్థోపవనసురాలయవిహరణకల, హేలాకల, గృహాకల, వశ్యౌషధకల, మంత్రకల, వృక్షకల, కేశరంజనకల,

భిక్షుకతాపసబహువిధపుణ్యాకల, ద్వీపదర్శనకల, కుట్టినీకల, యనునివి.

ఊరుఁ, పేరు, వర్ణము, గుణముఁ దెలియని వాని కైనను గొంచెము ధనమిచ్చిన శరీరము నర్పించు వేశ్యలయందుఁగూడఁ గొందఱు మోహసంకల్పంబు సద్భావములను వెదకుచున్నారు. సకలజనులను వంచించి యార్జించుకొనిన యనురాగము నశించిన హృదయములు గల వేశ్యల మలినధనమును గూడ నొకానొకహీనుఁడు గుణగణమగ్నుఁడు దిక్కుమాలినవాఁడు, భుజియించుచున్నాఁడు! నీచుఁడైనను, గుజ్జి మెక్కువాఁడైనను, ఖలుఁడైనను, నేరుఁగునెక్కువాఁడైనను, శిల్పియైనను, నిఖిలలోకవంచనమె వృత్తిగాఁగల యావారకాంతలకు వల్లభుఁడగుచున్నాఁడు.

పూర్వకాలమున మానవంతుఁడగువిక్రమసింహనృపాలుఁడు బలవంతులగువైరుల కోడిపోయి గుణగరిష్ఠుఁడగుమంత్రితోఁగూడ విదర్భకుఁ బోయి యక్కడ మిగులఁ బ్రసిద్ధినడసిన విలాసవతియను నొక వేశ్యయింట విడిసి నిర్ధనుండయ్యు బహుధనభోగయగు దానితోఁ గూడియుండెను. ఆవారకాంత, రాజలక్షణోపేతుఁడగుటను భుజసత్త్వసంపన్నుఁడగుటను నరపతి యని గ్రహించి తనకున్న మణికనకసంయుతంబగు కోశమంతయు నావిక్రమసింహునకు వ్యయార్థము సమర్పించుచుండెను. దాని యౌచిత్యము నద్భుతానురాగమును గాంచి రాజు మిగుల విస్మయమంది యెవ్వరు లేనిచోట నొకనాఁడు మంత్రి

తో "ఇది మిగుల విచిత్రము! తృణప్రాయముగా ధనమంతయు మదర్థము వినియోగించుచున్నయది! వేశ్యల యనురాగము ధననిమిత్తముగానఁ బ్రీతిలేనిదిగదా! ఇదియేమి? ధనలవలోభమున మిథ్యానురాగమును రోవెలందులు చూపుచున్నారు, కాని, యెవ్వతె యేని యేవాసికొఱకైన ధన మిచ్చునా? అట్టిచో వారి యనురాగము సందేహామే" యని చెప్ప నరపతి వాక్యములకుఁ బ్రధాని సాసూయముగా నవ్వి "రాజేంద్ర! వేశ్యాచరితమునం దెవ్వనికి విశ్వాస ముండును! వారు సత్యరహితలు, స్వల్పధనలోభము గలవారు, క్షణభోగదాయినులు, తీయనిమాటలతో [illegible] హృదయముం జొచ్చెదరు. ఈభోగాంగనలు నరుల కాశపలెనే ప్రథమసమాగమమున సుఖమును గలిగింతురు. నడుమ [illegible]ఖముం గూర్తురు, తుదకు దుఃఖఫలము లభింపఁజేయుదురు. భ్రమరిభ్రము బహుమోహములు గల వేశ్యలను [illegible] నిష్కృతికిని హరిహరాదులగు బృందారకులు గూడఁ దెలిసికొనఁ జాలకున్నారు" అని పలికిన వారాంగనా[illegible] మంత్రితో రహస్యముగ నాలోచించి విక్రమసింహుఁడు కృత్రిమ[illegible] బడియుండెను. ఎఱిఁగియున్న మంత్రి యా రాజశవమును చితిమీఁదనుంచి యగ్ని దగుల్పుచుండ నంతలో నాకామిని పరువెత్తుకొని వచ్చి చితిపైనున్న రాజుతోఁ గూడ వల్లకాటిలోఁబడి మ్రందెనో [illegible] దానియుత్తమ[illegible] రాజు [illegible]

చేబ్రదికితి నని యాదార్యాభాగ్యురాలిం జూచి దానిదృఢప్రేమకు సత్యమునకు సంతసించి మంత్రిని నిందించి వేశ్యాగుణకథనము గావించెను. పిమ్మటఁ దన కా పెల్లాటకర్త యిచ్చినధనముతో నేనుఁగులు గుఱ్ఱాబులు భటులు మున్నగు విపులసేనం గూర్చుకొని తనవిరోధులను జయించి స్వరాజ్యమును మరలఁ బొంది పూర్ణచంద్రునట్లు వెలుంగుచు నాపణ్యవనితనే యంతఃపుర తరుణింగా నొనర్చుకొనియెను. చామరపవనాపలితాలకయై యా తన్వి యాతనియొద్ద లక్ష్మివలె శోభిల్లుచు నొక్కనాఁటి యేకాంతమున విరచితాంజలియై నమస్కరించి "ఈదాసి కల్పకవృక్షమట్టి నిన్నుఁ జిరకాలమునుండి సేవించుచున్నది. ఒకానొకప్పుడు ధన సహాయమున నీకుపకరించిన నాకీసమయమున వాంఛాసాఫల్యము గావింపవలయును. పుణ్యఫలప్రాప్తి కారణంబులు, పరరజోహరణమార్గంబులు, స్వభావవిమలములు నగు మహాత్ముల సమాగమంబులు పుణ్యతీర్థముల యట్టులు వృథకావు. నాకొక్క యావనపురుషుఁడు ధనముకంటె జీవితముకంటె నెక్కుడు ప్రియము గలిగినవాఁ డిప్పుడు చోరకర్మమునం బట్టువడి దైవవశమున విదర్భపుర కారాగారమున నున్నాఁడు; ఆతనిని నానిమిత్తమై సమర్థుఁడవు గాన విడిపింపఁగోరెదను. ఇప్పటియున నీపౌరుషమునకు, శక్తికిఁ, గులమునకు నుచితసుకృత్యము గావింపవలయును" అనిన దానిపలుకు లాకర్ణించి యాశ్చర్యవిమగ్నుఁడయి భూమిపాలకుఁ జూచుచు [illegible] వెతుకటి మంత్రి వాక్యములం దలంచుకొని విదర్భరాజుం గొట్టి చోరుని విడిపించి తెచ్చియిచ్చెను.

ఇట్లు బహుహృదయలు, బహుజిహ్వలు, బహుమాయ లును, వాస్తవముగా నన్నృతయుతలు నగు వేశ్యావనితల నెవ్వరు కనిపెట్టఁగలరు. వారికి వర్ణనదయితుఁడు, ధనదయితుఁడు, దాన కర్తదయితుఁడు, రక్షాదయితుఁడు నర్తదయితుఁడు నని యేపురు దయితు లుందురు.

---

## పంచమసర్గము.

మోహుఁడు జనులసర్వము నపహరించు సామర్థ్యము గలవాఁడు. ముందుగా బుద్ధిని నశింపఁజేయును. ఆతఁడు గూఢ రూపమునఁ గాయస్థుల[1] ముఖములయందును వారి వ్రాఁతలయం దును నివసించియుండును. ధనధాన్యాదికసమృద్ధిగల యెవ్వరిం జూచినను సంపూర్ణచంద్రుం గాంచిన రాహుగ్రహమువలె నీకా యస్థగ్రహము సర్వగ్రాహముఁ గావింపకమానదు. మోహవిదూ రులగు యోగులు జ్ఞానులు సంసారకలల నన్నిటిని దెలిసికొం దురు గాని బహుప్రయత్నులైనను గాయస్థుల కలలను (మోస ములను) దెలిసికొనలేరు. వివిధమాయానిలయులు, ధనాగార రంధ్రములు, క్షయక్షపాతిమిరులునగు నీ దివిరులే[2] సమస్తమును లీనము చేయుచున్నారు, గాని, కాలము కాదు. జనులను ఘోర దండము పాలొనర్చువా రగుటం బట్టి వీండ్రే కాలపురుషులు.

---

1. కాయస్థులు=పూర్వము రాజులయొద్ద నధికారములుచేసిన యొకజా తివారు. వీరు జనులను బహువిధముల బాధించువారు.

2. దివిరులు=కాయస్థులకే రెండవపేరు.

గణనాతీతపిశాచములే యీభూర్జధ్వజు[1]లను మిషం బ్రపంచమునం దిరుగుచున్నవి. యమమహిషశృంగకుటిలహృదయులగు వీరినెవ్వరును విశ్వసింపరాదు. యమపాశము గూడ నిదివిరుల కంఠములం దగుల్కొన భయపడును. కాయస్థులచే హరింపఁబడిన రాజ్యలక్ష్మి వారు వ్రాయు కలము తుదనుండి జాఱు నల్లని మషీబిందురూప మగుకన్నీరువిడుచుచు రోదనము గావించుచున్నది. మాయావనితాలకావలీకుటిలములు, విషమాంగన్యాసయుతములు నగు కాయస్థుల చారిత్రములచే మోహితుఁడు గానివాఁడగపడఁడు. ఈమాయాప్రపంచము విషయగ్రామగ్రాస స్వభావముగల కాయస్థులచేతను నింద్రియములచేతను సర్వకాలములయందును నాశనము నొందుచున్నది. కాలపాశసన్నిభములుఁ గుటిలములు నగు దివిరుల వ్రాఁతలు భూర్జశిఖరములందుఁ జుట్ట చుట్టుకొనియున్న సర్పములవలెఁ గన్పట్టుచున్నవి. వీరలే చిత్రగుప్తులు, చిత్రబుద్ధులు, గుప్తకార్యులును. ఒక్క గీటుమాత్రము చెఱచి సహితపదమును రహిత[2]మని మార్పఁజాలిన ప్రజ్ఞకల

1. భూర్జధ్వజులు=భూర్జపత్రములపై రాజకీయవ్యవహారముల నాయవ్యయముల వ్రాయఁ గాయస్థులకు వచ్చిన మాఱుపేరు.

2. ఏదైనఁ బత్రము వ్రాయునపుడు "ఫలవృక్షసహితముగా" నని వ్రాయుచున్న ముందఱ వ్రాసి పిమ్మట రెండవపక్షమువారియొద్దఁ గొంత లంచము పుచ్చుకొని "ఫలవృక్షరహితముగా"నని దిద్దుదు రనుట. ఈ స, ర లకు భేదము నాగరాక్షరములలో నతిస్వల్పము. ఇక్కడియభిప్రాయము నాగరాక్షరముల ననుసరించియే యున్నది. అందొక్క గీటు చెఱపినను స యనునది ర యగును.

వారు. (1) భేదాక్షరములు(వక్రలిపి)వ్రాయుట,(2) అంకములు గుప్తముచేసి వ్రాయుట,(3)వచ్చినవారిని దమవశము చేసికొనుట, (4) వ్రాసినదానిలో నడుమ నడుమ నొక క్రొత్తమాట చేర్చుట, యున్నమాట తీసివేయుటయు, (5) వ్యయము నెక్కువగాఁ జూపించుట,(6) యోగ్యవస్తువులను బొల్లుపంచుకొనుట, (7) ఈయవలసినధనమునీయకుండుట,(8)మిగిలినధనముహరించుట,(9)ఒకప్పుడు పోగుచేసిన ధనమంతయు హరించుట,(10)మొత్త మెంతో తెలియకుండఁ జేసి యాయవ్యయములు చేయుచు ధనము హరించుట, (11) చినిఁగిపోయిన పత్రములు వ్యవహారములోనికిఁ దెచ్చుట, (12) నష్టపత్రములం గనఁబఱచుట, (13) ఉన్నదానిని నష్టమైన దని చెప్పుట,(14) విక్రయించినదానిని మరలఁ దెచ్చుకొని వాడుకొనుట,(15)"ఈధనములోనుండి కొంత హరించుట యెట్లు, వీనిని మోసపుచ్చుట యెట్లు" అని నానాప్రకారముల యోజించుచుండుటయు, (16) అడుగవచ్చినవాని కాధారము లేకుండ వ్రాఁతమూలములు తగులఁబెట్టుటయు నని, సకలంకుఁడు, క్షయస్వభావముగలవాఁడు, నవనవరూపుఁడు, వృద్ధిఁబొందవలసినవాఁడు, నగు కాయస్థునికిఁ గుటిలములగు కళలు పదాఱు దోషాకరుం డను చంద్రునికివలెనే కలవు. కూటస్థుఁడు గాయస్థులను, సర్వోపకారమును సద్ధర్మమును త్రుంచే గుణునివలె విదితమాయులై క్షణములో స్వత్త్వచ్ఛేదముం గావించుచున్నారు.

పక్షిజాతులు [illegible] ధనము, వసువులు, కట్టుకొనుబట్టలుఁ బోఁగొట్టుకొని [illegible] కలిగి బంధువులు వినక

ర్శింపఁగా మిక్కిలి వ్యసనపరుండై పూర్వకాలంబున సమస్తస్థలములం దిరుగుచుండెను. అతఁడు పుణ్యవశమున నొకప్పు డుజ్జయిని వచ్చి స్నానముచేసి తిరుగుచు నొక విజనస్థలమున శివాలయముం గాంచెను; ఆదేవాయతనములోనికిం బోయి నిరాహారుం డగుటచే నిత్యమును గడుగుచుఁ దుడుచుచు బుష్పంబులం బూజించుచు, స్తుతించుచుఁ బెద్దకంఠముతో గీతములు వాడుచు, దీపము వెట్టి నిర్నిద్రుండై జపముచేసికొనుచుఁ దనదుర్గతి పాపుకొన నాదేవుని సేవించుచుండెను. ఒక్క దివసంబున నాతండు గావించు శుభశతమునకు మెచ్చి భవభయహారియు భూతపతియు నగు మహాదేవుండు "పుత్రా! ఇదిగోఁ గొను"మని యేమో వర మనుగ్రహింపఁ దలంపఁ గపాలమాలికలలో నున్న యొక్క పుత్రి యనవరతము మహాకాలునకు సంజ్ఞ చేయసాగెను. అర్థోక్తికే మిగులఁ బీడింపఁబడి కపాలము సన్న చేయుచుండ నెఱింగి యాజూదరి దురదృష్టమున నీశ్వరుం డూరకుండి యొక్కింతతడవునకు వాఁడు స్నానార్థం బరుగ నెవ్వరు లేనియపుడు దంతాంశుపటలపంక్తి గంగాతరంగములవలె నెఱయ నాపుఱ్ఱెతో నిట్లనియె. ఈకితవుండు నన్ను సద్భక్తిచేఁ జిరకాలమునుండి యాశ్రయించుకొనియుండెను; సాధువైనవీనికి నేను వరదానముం గావింపఁ బోవ నీవేమి నిమిత్తమున నన్నుగోఁకి సంజ్ఞ చేయుచుంటి వని యడిగెను. ఆకపాలము దేవునిపల్కులువిని విషనయనోష్మచే గళితమగు మౌళీందుసుధారసమునం జీవించినదియుంబోలె నిట్టులని విన్నవించుకొనియెను. "ఆదిదేవ, యిదిసులభముగఁ దమకు

విశదమైన దైనను నన్ను మరల నడుగుచున్నారు. ఈజూదగాఁ డతిదుఃఖితుఁడై, దారిద్ర్యప్రభావముచే నిఖిలనిజకృత్యములను విడిచి యీ నీమందిరమున ధూపదీపములు కుసుమార్చనముం గావించుచున్నాఁడు. దుఃఖితుఁడు తపస్వి యగుచు. ధనరహితుఁడు సాదరుఁ డగును. భ్రష్టాధికారవిభవుఁ డింతకును మున్న సర్వప్రణుతుఁడై యుండినను బ్రిమునవుఁ డగుచు. నిర్ధనుఁడు దేవార్చనముం గావించును. విప్రులకు నమస్కరించుచు. పెద్దల గుఱ్ఱె యుండును. మిత్రములను వెదకును. ఇచుపగుండు కఠిన మైన దైనను గాల్పఁబడెనా పనుల కొదవును. వ్యసనపరితప్త హృదయుఁడు సర్వకాలమును సదాచారుఁడుగా నుండును. వైభవమదమోహితునకు సత్కర్మలు జ్ఞాపకమునకే రావు. భగవానుఁడా ! ఆశాపాశములచే వ్రేలాడుచు నైశ్వర్యాపేక్షకుఁ డైన యీభక్తుఁడు నీకత్యంతసపర్యం గావించుచున్నాఁడు. మీరు వరము దయచేసినపిమ్మటఁ గంటి కగపడఁడు. ఒకకార్య మొకరివలన సాధింపవలయు నను తలంపుగలవాఁడు సేవకుని వలె నుండును. పని తీఱినవెనుక నెవ్వరుచు బ్రపంచములోఁ గృతఘ్నులు నమ్రభావముం గనఁబఱపరు. తనకు లాభ మున్నపుడే యొకరియొద్ద నతియత్నమున నుండుదురు. కార్యము నెఱవేఱిన పిమ్మట నిష్ప్రయోజకు లగుదురు. దేవా ! ఈయాలయమున ఫలజలకుసుమాదిభోగసామగ్రి వీనివలనఁ బూర్ణముగా నున్నది. ఈతండు పోయినపిదప విజనంబగు నిక్కడకు నెవ్వరుచు రేరు. కాఁబట్టి యుక్తితవు నిచ్చుటనే రక్షించుచుండుము. వర

మిచ్చితివా నీపూజ నీవే చెఱచికొందువు. ఇట్లని విన్నవించిన యాకాయస్థకపాలముమాటలు విని మిక్కిలి విస్మయంబునుబొంది మహాదేవుండు "నిజముగా నీ వెవ్వఁడవో చెప్పు" మని యడిగెను. "నేను మగధదేశమున గాయస్థకులంబునం బొడమి స్వకులాచారములు విసర్జించి యనవరతము స్నానజపవ్రతనిరతుఁడనై తీర్థాటనము గావించుచు సకలశాస్త్రములు నర్థసహితముగ నేర్చుకొని భాగీరథీనదిలో మేను దొఱంగి నీపాదపద్మములాశ్రయించితిని." అని వాఁడు దేవునితో విన్నవింప నాకర్ణించి "కపాలశేషముగా నున్నను నీకౌటిల్యకళను విడువలేదు కావున నీవు సత్యముగాఁ గాయస్థుఁడవే" అని ఫాలలోచనుం డాశాలతలందుఁ దనమందహాసకిరణములచేఁ దెల్లపువ్వులు పూయునట్లుచేయుచు నింతలో స్నానము చేసి వచ్చిన యాబీదజూదఱికి వరదుఁడు వర మిచ్చి హిత మొనర్చి యతిశీఘ్రముగఁ దన రుండమాలికలోనుండి యా కాయస్థకపాలముం దీసి విసరివైచెను. అస్థిశేషుఁడైనను గాయస్థుఁడు జనాపకారముం గావించునది సహజమలిన మయినదియు నగుతనకుటిలకలను యముదంష్ట్రను వలె విడువఁడు. సతతాశుచులు భావదూషితులు దోషయుక్తులు నగు కాయస్థుల కలల నెవ్వరు తప్పించుకొనఁ గలరు! రాక్షసమాయలకంటెను బ్రాఘము లగు వీరిమాయల నెవ్వఁ డెఱుఁగునో వానివలన రక్షింపఁబడినభూమి రత్నములనే పుట్టించును.

---

## షష్ఠసర్గము.

సమస్తజనులహృదయములందును మదుఁడను నొక శత్రుఁడు కలఁడు. మదావేశముగల జనుఁడు మాటలాడఁడు, వినఁడు. మొద్దువలె నుండును. కృతయుగమున విజితాత్ములయం దుద్భవించిన దముఁడే యీయుగమున నక్షరములు తలక్రిందై మదుఁడను నామముతో నరులయం దావేశించినాఁడు. మాటాడ కుండుట, నోరు మూసికొనుట, మీఁదికిఁ జూచుట, చందనాదిసుగంధద్రవ్యములు పూసికొని శ్రేష్ఠ మగు వస్త్రభూషణాదులను దొడుగుట, కట్టుట, యనునివియే మదునియాకారము. శౌర్యమదము, రూపమదము, శృంగారమదము, కులోన్నతిమదము, విభవమదము నని మదభేదములు. ఈమదవృక్షమునకు మూలము విభవమే. కొఱుత గ్రుచ్చిన వానివలెను, వాతస్తబ్ధునియట్టులు, భూతముపోలికను, భ్రమజ్వరసన్నిపాతునిరీతిని విభవమదయుతుఁ డుండును. శౌర్యమదుఁడు భుజములం జూచి పొంగును. రూపమదుఁ డద్దము చూచుకొని యుబ్బుచుండును. కామమదుఁడు స్త్రీలవంకఁ జూచుచుండును. విభవమదుఁడు జాత్యంధుఁడే. సుఖరసముచే నంతరంగము మూర్ఛమునిఁగినఁ గన్నులు మూసికొని, ధ్యానము చేయువానివలె నుండి, ధనమదులు కొందఱు నరులకాత్మారాములవలెఁ దోఁచెదరు. అవసరములేని విషయములోఁ బిచ్చివానివలెఁ దిరుగుచు, వివిధవికారము లగపఱచుచు, సకలసుగుణవిహీనుఁడై చిత్తమును నిరాలంబము నగు మూఢమదావేశికుఁడు లోకమునం

దంతటఁ జరియించును. తపోమదము గలవాఁడు భూమివంకఁ జూడక యాకసముం గాంచుచుండును. భక్తిమదుఁడు స్వభావముచేతనే యొడలు మఱచి చలచిత్తుఁ డగును. కోపముచే నెఱ్ఱవాఱిన నేత్రములు గలిగి, పరుల మాటలను సహింపక తానుమాత్రము ప్రేలుచు జనులను బాధించు విషముం డగు శ్రుతమదుఁ డొక్కఁడు కలఁడు. ఎప్పుడును గనుబొమ్మలు ముడివైచుచు, గట్టిగా మోటుమాట లాడుచు, నకస్మాత్తుగా బరులకు హానిచేయుచు రాక్షసునివలె సర్వభక్షకుం డధికారమదుఁ డగు క్రూరుఁడు. తమ యింటి తొల్లింటి పెద్దలగాథలు చెప్పుటలో నితరులను దన్నుఁ గూడ మఱచిపోవునట్లు చేసి యజ్ఞానులను గావించునది కులమదము. ఒక్క వస్తువును ముట్టికొనక యశుచులకెల్లను దూరముగ నుండి ప్రతిదానిని శంకించుచు నాకసమునఁ గూడఁ బేడపూఁత పెట్టఁ దలఁచువాఁడు శౌచమదుఁడు. పైని జెప్పిన మదము లన్నియును గొంత యవధిలోఁ దమ తమమూలచ్ఛేదముచే నాశన మగును. కాని కుటిల మగు వరమదముమాత్రము నిరవధికముగా విజృంభించుచున్నది. సర్వానర్థాకర మగు పానమదము మిక్కిలి చెడ్డది. దీనిక్షణకాలసేవవలన వెనుకటి వేయువత్సరములలో నార్జించిన సచ్ఛీలము వమ్మగును.

"వినయము విద్యయుం గలుగువిప్రునియందును గోవునందునా వ్వానెనయు హస్తియందు నొకకోఁకకుఁబోవనికుక్కయందు దా

ని నడిచి తెచ్చి వండితినుగనీచపుమాలనియందుఁ దుల్యద
ర్శనుఁ"డగుమద్యపాని; స్వపరప్రవిమర్శనముండ దింతయుఁ ౙ"

సదసద్భేదము లేక బంగారునందు ఆాతియందుఁ జిల్ల
పెంకునందుఁ సమానబుద్ధి కలిగి, యోగిదశను బొందినను మద్య
పానము చేయువాఁడు పాపియై శీఘ్రకాలములో నరకమునందుఁ
బడును. సంసారాదర్శమండలుం డగునామత్తుఁడు బహువిధము
లుగ నేడ్చును, నవ్వును, గొంతెత్తి వెఱ్ఱిపాటలు పాడును,
మోహముం బొందును, వికారచేష్ట లగపఱచును. తప్పఁద్రాగిన
దుర్మార్గుఁడు పరపతిచుంబనసక్త యగుభార్యను గాంచి సంతాప
పడఁడు. ఒకవేళ నాతఁడు ప్రీతరాగుఁ డేమో! మత్తుఁడు కట్టు
కొన్న వస్త్రము దూరముగా విప్పి పాఱవేయును, దుఃఖమును
మీఁదఁ బడ వైచుకొనును. దోసిళ్లతో నిజమూత్రతుల్య మగు
కల్లుం ద్రావును.

పూర్వకాలమునఁ జ్యవనుఁ డశ్వినీదేవతలవలన శరీర
దార్ఢ్యమును బొంది ప్రత్యుపకారముగా వారికిఁ దాను గావించిన
యజ్ఞమునందు సోమపానార్హత కల్పించెను. ఇంద్రుఁడు దానికిఁ
గోపించి యాచ్యవనునితో "సోమునీంద్ర! పఙ్క్తిబాహ్యులు
గాని యీవైద్యుల నిద్దఱను సోమపానార్హులను జేసితి వేమి?
నీ వెఱుఁగవా" యని బహువిధముల నిషేధింపఁబడినను దన
తేజోబలముచే లక్ష్యము చేయక నిశ్చలముగా నుండి యశ్వి
నులకు సోమ మిచ్చెను. ఆకోపముచే నింద్రుండు బలిష్ఠ మగు
చేతినుండి పై కెత్తిన వజ్రాయుధమును, జేతిని, ముని ప్రభావ

సామర్థ్యమున స్తంభింపఁజేసి యాతని వధించుటకై నాలుగు కోఱలు, కాలతుల్య మగు రూపము, సహస్రయోజనవైశాల్య దేహమును గలయొక భయంకర రాక్షసుని బుట్టించెను. దేవేంద్రుఁ డట్టి ఘోరాకారుని గాంచి భయపడి మునీంద్రుని శరణము వేఁడికొని, ధైర్యము వీడి, యశ్వినులకుఁ గూడ సోమభాగ ముండుఁగాక యని సన్నుతించెను. దిగులు చెంది నమస్కరించిన యాస్వర్గాధిపతిని గాంచి మౌని కరుణించి "గర్వము మానుము, ద్యూతము, స్త్రీ, పానము, వేఁట వీనియందలిమద ముడుగును." అని బోధించి యోవాన్ని విడిచిపెట్టెను.

ఆముని తలంపుననే కలిగిన మదనాముఁడగు రక్కసి నాఁడు మొదలీలోకమునంగల శ్రీమంతుల మానమునందును ప్రవృద్ధ విభవుల నిశ్చలదృష్టులయందు, ధనవంతుల బొమముడితోఁగూడిన ముఖవికారములందు, విటులు మున్నగువారి కనుబొమలయందు, దూతలయొక్క నాలుకమీఁద, రూపవంతుల దశనవసన కేశముల, వైద్యులపెదవులందు, నియోగిగణకాదులకంఠమున, భటుల బుజంబులను, వ్యాపారుల హృదయములను, శిల్పుల చేతులలోను, శిష్యుల గళపత్రాంగుళిభంగముల, స్త్రీలస్తనములందు, శ్రాద్ధార్హులయుదరములలో, వార్తాహరుల పిక్కలయందు, నేనుంగుల గండస్థలముల, నెమిళ్ల పింఛముల, హంసల నడకలయందు, స్తంభాకారుఁడై మహాగ్రహుఁడై బహువికార పృథమోహముతోఁగూడి నిలిచియుండెను.

---

## సప్తమసర్గము.

జనుల సమస్త క్రియాకలాపములకు నాధారమైనది ధనము. అట్టిదానిని తమవికారకంఠము లెత్తిపాడుచు ధూర్తులగు గాయనులు (పాటపాడువారు) హరించుచున్నారు. కమలాకరకోశమును నిశ్శేషముగా సంగ్రహించియుఁ గుముదముం జెంది హీనములగు గాయనభృంగములు మాతంగప్రణయమును విడువవు. ఘటపటశకటాదులతోఁ బెక్కుమంది బిడ్డలతోఁ దలలు విరియంబోసికొని లోకమున యోసపిశాచము లనఁదగు రాజద్రవ్యాపహరు లగు పాడువారు తిరుగుచుందురు. దొంగవాఁడు చీఁకటిలో దొంగిలింపవచ్చి జనులహాహాకారములకు బెదరి పోవును. ఈగాయనచోరులు జనులచే హాహా యనిపించి (తాము హాహా యని) పట్టపగలు ధనము నపహరించుచున్నారు. "పాపాధధనిని గమసా ధాధామామాసమాసగాధామా"యని స్వరకల్పనచేయుచు సంచరించుచున్నారు. కుటిలము లగు వేషవికారములచేతను ముఖవికారములచేతను మద్దెలను స్పృశించి కొంతసేపూరకుండి గాయనసంఘము పాడఁదొడఁగును. పదమధ్యమందు జయజయ యను హుంకారము గావించుచుఁ దమపాటకుఁ దామే మేలుమే లనుకొనుచు గీతములులోపముగాఁ బాడుదురు. నీరిలోఁ బడిన పిండియుండ చేఁపలు దిన్నచో నేమైన ధర్మావాప్తి కలదు గాని పాటకాండ్రకుఁ గోట్లకొలఁది యిచ్చినను ఫలలేశమైనను గనఁబడదు. చీఁకటిగదులలోఁ బడియున్న కృపణులధనమునకుఁ గూడ నీనోళ్లుతెఱచుకొని పాడుగాయనులు బైటికి వచ్చు

టకు మార్గములు. పాడునప్పుడు పండ్లుకనఁబడకుండ నోరుమూసికొనిపాడుచు నిదివఱకుఁ బాడినవారిని ధనముగొన్న వారిని నవ్వుచుందురు. ఈబయకాం డ్రుదయమున హారకేయూరాదుల నలంకరించుకొని ధీరుల పోలియుండి మధ్యాహ్నమున జూదమునందు సమస్తంబు నోడి దిగంబరులై నిరాహారులై యుందురు. స్తుతు లనువలలచేతను గకటుకూటరచనలచేనొప్పు మాట లను బాణములచేతను గాయను లనుబోయలు మూఢు లనులేడుల సర్వస్వము నపహరించుచున్నారు. సప్తస్వరములను బదములను క్షణకాలముపాడి లక్షలు గడించియును నా కాడాసీపుత్రుఁడేమో యిచ్చు ననుకొంటి నని యసంతుష్టిచే దుష్టగాయకుఁడు దుఃఖించును. సాధువులకు ద్విజులకుఁ బెద్దలకు నుపకరింపక సకలశోకాకలితమైనలక్ష్మి పాడువాండ్రం జేరుట దానికి శాపకారణమైనది.

చాలనాళ్లకు సభలోనికి వచ్చిన నారదుం గాంచి యింద్రుండు భూలోకమునందలి రాజుల వృత్తాంతము లేమి యని యడిగెను. దానికా మహాముని జనపాలు రైన నరపాలురు భూమిలో బహుదానధర్మములతోఁ గూడి శతక్రతువులు గావించి యింద్రయోగ్యమైనభోగము లనుభవించుచుండి నిన్నును మనుజుని గుబేరుని లెక్క సేయుట లేదు; నీవు శతక్రతుఁడ వగుదు, మేము బహుక్రతుల మని నవ్వుచున్నారనియెను. అంతటఁ గోపించి దేవపతి మర్త్యలోకమునందున్న ప్రభువుల ధనము నంతటఁ బిశాచములకు [illegible] మహామాత్రు [illegible] మొ

ద్ద నేర్చికొని మాయాదాస, డంబరదాస, వజ్రదాస, క్షయదా-
స, లుంఠదాస, ఖరహరదాస, ప్రసిద్ధదాస, బాడబదాసులను
నెనమండ్రు పిశాచములు మొదట భూలోకమునకు భయంక
రాకారములతో వచ్చి పెద్దవెడఁద నోళ్ళతోఁ గొందఱు పాటకు-
లను గల్పించిరి. ఆవారిచే మిగుల ధనము హరింపఁబడి రాజులు
యజ్ఞములు చేయుయత్నము మానుకొనిరి. వారే మాయచేత-
భూపతుల కర్ణములలోఁ జొచ్చి కర్ణపిశాచము లనుపేరున హృ
దయముం దొంగిలించుచున్నారు. కావున నీవికారరూపుల నే
నరేంద్రుఁడు తనరాష్ట్రమున నడుగిడనీయఁడో యాతనికి భూమిం-
సకలార్థసంపత్తులను గూర్చును. యజ్ఞాదికములు సాగునట్లుచేసి-
తా నాప్రభున కధీన మగును. నటవిటాదులు దేశసంచారులు
వేసగాండ్రు మున్నగువా రైశ్వర్యసస్యములకు మిడుతలవంటివా-
రు. ఆకారణమున వారిం జేరనీకుండ ధనమును రక్షింకొనవల-
యును. అపాత్రదత్త మైనలక్ష్మీదేవియాక్రందనధ్వనివలెఁ బలువ్రు
రు గాయకు లొక్కచోఁగూడిన రాగధ్వని బైలు వెడలును.

---

## అష్టమసర్గము.

బంగారుపనివాండ్రు హరించుకళయందు ధ్యానముకలవా-
రైన యోగులు. తమయింట నెంతధన మున్నను లేమిని బ్రక-
టించుకొందురు. సకలధనములకు సారము, సంపద గలయపుడు-
భూషణ మగును, విపత్తులలో రక్షించు, నిట్టితేజోవంత మైన బం-
గారును బాపాత్ములు దొంగిలించుచున్నారు. ముట్టుకొనినంత నె-

సువర్ణమును (మంచికులమును) గాంతిహీనము గావించి దూ
షితము చేయుచున్నారు. కావున వీరు నిత్యాశుచులు. చండాల
సమానులు. వీరలయొద్ద మృదు వగునది గరుకైనది రెండువిధ
ములగు గీటురాళ్ళుండును. ఒకదానిపైఁ గీచిన మంచిబంగారు
వన్నెయే చెడును. రెండవదానిపై గీచినఁ జెడ్డబంగారు మంచిరం
గుగాఁ గనఁబడును. కొనునపుడు విక్రయించునపుడు వా రా
రెంటి నుపయోగింతురు. జిడ్డుతోఁగూడినవి చెమ్మగిల్లినవి మట్టివి
యిసుకతోఁ జేయఁబడినవి వేఁడివియు నయి యైదు తెఱఁగుల
తూనికెరాళ్లు వారియొద్దనుండును. మూఁతగలది ప్రకటముగాఁ
గరఁగునది కరఁగుచున్న బంగారు రసముఁ బీల్చునది రాగికలిపి
నది సీసపురజము గాజుపొడి మొదలగువానితోఁ జేసినదియు
నను నాలువిధములగు మూస లుండును. వంకరముఖముగలది,
యెగుడు దిగుడు చిప్పలుగలది, చిల్లుచిప్పలుగలది, యడుగునఁ
బాదరసముంచునది, మట్టిది, విజ్జోడుదండముగలది, ముళ్లుపడిన
త్రాడులుగలది, తారము కుదుర్చుకొనుట కొక్కవైపున గుడ్డసం
చికలది, పెక్కుత్రాడులుగలది, యెల్లపుడు ముందునకువ్రాలునది,
గాలికిఁ గదలునది, సున్నితమైనది, మోటుది, పెనుగాలిచే దూ
ళిపడినది, నిర్జీవయు, సజీవయు నను పదాఱువిధములతక్కెడ లుం
డును. మఱియు వారు నెమ్మదిగను, వేగముగను, నడుమనడుమ
మానుచును, ఘూయనుశబ్దము గలుగునట్లుగను, గ్రుక్కత్రిప్ప
కుండగను, దుంపురులు పడునట్లును నాలురీతుల నిప్పూఁదుదు
రు. వెండియు జ్వాలలెగయునట్లు పొగచుట్టుకొనునట్టుల వికసిం

చుకితిని మండాగ్నిగను మిణుఁగురులు లేచునట్లుగ నంతకుముం
దే రాగిముక్కలు కాలుచున్నరంగుమంటలు బైలుదేఱునట్టుల నా
లుతెఱంగులఁ గుంపటిలో నిప్పూరాఁజఁబెట్టుకొను. కంసాలి పనిఁ
జేయించుకొన వచ్చినవారితో నేవియో ప్రశ్నలు వేయును, కథ
లు చెప్పును, చిత్రములు పలుకును, గోఁకికొనును, ఎదుటివాని
వస్త్రపుఁగొంగు పరీక్షించును. ఎంతప్రొద్దుపోయిన దని సూర్యు
నివంకఁ జూచును, వికవికనవ్వుచుండును, ఈఁగలఁదోలికొనును,
గాతుకముం గనఁబఱచును, ఒకరొకరికిఁ గయ్యము వెట్టును, నీటి
చెంబు బోరగిలఁద్రోయును, గడియగడియకు బైటికిఁబోవును,
ఇవి పండ్రెండును వాని చేష్టలు. రత్నాదికఘటితమగు నగలపై
నుప్పు కారమును బులిమి యగ్నిపైనుంచి రంగుమార్చి వేయును.
ఇరుప సిబ్బెలత్రాసులో నొకదానిలో బంగారుంచి రెండవదాని
క్రింద భూమిపై సూదంటురాయి పెట్టును, దానిచేఁ దూఁకవేతా
యి వేయుకున్నను రెండవవైపున నున్న సువర్ణముతో సరితూ
గును, లక్కపెట్టవలసిన గల్లవస్తువులలో బంగారుతునుకను దాఁ
చును. దానిని లక్కపెట్టునప్పుడు సులభముగాఁ బైకిఁ దీసికొనును.
మెఱుఁగు పెట్టఁదలఁచిన నగలకు సువర్ణమంటించును. మెఱుఁగి
సుకతోఁ దోమునప్పుడు సుకరముగాఁ దీసికొనును. మంచిబంగా
రునగను దాఁచి చెడ్డబంగారునగను దానికి మారు మెఱుఁగు
పెట్టియిచ్చును. పుచ్చుకొనునప్పుడు తూఁచును. యిచ్చునప్పుడును
దూ[illegible] వన్నె మొదలగునవి
యు[illegible]కైన పిమ్మటఁజూచినఁ గాలము

వెణ్ణమైనది కావున నఱిఁగిన దని చెప్పదురు. కరఁగుచున్నపుడు మంచిదానిలోఁ జెవుదువర్ణము కలుపుదురు. ఎన్నివిధములుగానో యున్ననగల నన్నిటి నొక్కమూసలోనే కరఁగించుట మొదలగు నలువదినాలుగు మోసములు కంసాలులయొద్దఁ గలవు. ఇక్కల లన్నిటిలో మంచికల వారువా రిచ్చిన సొమ్ము నగలును బట్టుకొని యొక్కరాత్రి చెప్పకుండ నెక్కడికేని బాఱిపోవుట. ఇవి మొదలగు కంసాలుల కలలు తెలిసికొనుట కెన్నఁడైన నిలయునవి యఱువదినాలుగు. ఇతరములు పెక్కులు కలవు గాని వానిని సహస్రాక్షుఁడును గనిపెట్టలేఁడు.

భూమికతిదూరమున మీఁదుగా మేరుపర్వతమున్నది. అది యంతదూరమున నుండుటకుఁ గారణము ముఖ్యముగా ఘోరులగు నీస్వర్ణకారులు హరింతు రని భయమందియో కావచ్చును. ఆమేరుపర్వతము బంగారుతాళ్ల సందున నెలుకలు నివసించి క్రమముగా మన్నంతయుఁ ద్రవ్వివ తాళ్లు కొఱికివైచుచుఁ గొండయంతయు నొడ్డగెడవుగాఁ బడునట్లు కావింపసాగెను. అప్పుడు సువర్ణశిలలు మూషకములు తెఱిఁగివేయఁగా వెలుదేఱిన రజంబు దిక్కులెల్లఁ గప్పి కపిలరంగులు గలదిగా నుండెను. అట్టి గిరిస్థితిం గాంచి దేవతలు ప్రళయము వచ్చునేమో యని శంకింప దివ్యజ్ఞానమున నగస్త్యుఁ డంతయుఁ దిలకించి యిట్లనియెను. ఈయెలుకలు పూర్వమున బ్రహ్మఘ్నులైన రాక్షసులు. వీరు దేవదానవయుద్ధములోఁ జంపఁబడినవారు. అట్టివారు మరల నెలుకలై పుట్టి మేరువుం బడఁద్రోయ యత్నించుచున్నారు. మీయొక్కయాశ్రయభంగము కాకుండ మీ రాయెలుకలం జంపవ

లయును. అనుమునీంద్రు వాక్యంబులాలించి దేవతలు మూషికముల బిలంబులనిండ నూదరగొట్టి పొగఁ జొన్పి చంపిరి. ఆమెలుకలే మరలభూలోకమున స్వర్ణకారులై పుట్టిరి. కావునను జన్మాభ్యాసమును విడువం జాలక యిప్పటికిని బంగారురజమును సంగ్రహించుచున్నవారు. కాఁబట్టి రాజనకెల్లపుడును జేయవలసిన దేమనిన:-విషమిడి చంపుదుష్టులు, దారికొట్టువారు, చోరులు లేనిసమయమందు స్వర్ణకారులను నిగ్రహింపఁదగును.

---

## నవమసర్గము.

ఈసముద్రమేఖలయగు భూమండలమున వంచకులు చేయు మాయ లపారములు. చేఁపలను బట్టుటకు బోయలు వివిధజాలములం బన్నునట్లె ముగ్ధులను మోసముచేయుట కనేకమాయలను గల్పింతురు. సర్వధనముకంటె నుత్కృష్ట మయిన ప్రాణములను జనులు వైద్యులచేతులలోఁ బెట్టుచున్నారు. వీరు లేనిచో విరహమువలె దుస్సహము. బహుతృష్ణులు, నుగ్రులునై గ్రీష్మదివసములువలె శోషిల్లఁజేయుదురు. తాము నేర్చికొనిన మందు పనిచేయునా చేయదా యను సంశయముచేఁ బ్రతిరోగియందును సర్వవిధౌషధములను నడిపించి వేలకొలఁది నరులం జంపి పిదప నౌషధసిద్ధు లగుదురు.

రాశి చక్రము వేసి ముఖవికారముతో రాసులు గ్రహములు లెక్కించుచుఁ బెద్దతడవు మిన్నకుండి యాకాశమునఁ జంద్రునితోఁగూడు విశాఖానక్షత్రమును జెప్పుచుఁ బ్రశ్న యడిగినవా

రికిఫలము దెలియఁజేయును గాని పెక్కుర జారులతో సంచరించు తన యిల్లాలిసంగతి జ్యోతిష్కుఁడు కనిపెట్టలేఁడు.

మొదటఁ దనధన మంతయుఁ జిత్తరువులు వ్రాయుట నేర్చుకొనుటకై వెచ్చించి తుద కేధనికునో రసికునో పట్టుకొని చిత్రకారుఁడు వాని విత్త మంతయు బూడిదపాలు చేయును.

ధాతువాది, నేను శతవేధి సిద్ధుఁడను గాని సహస్రవేధి సిద్ధరసము నొక్కదానిం జేసితిని. దానిని భుజించినబలముకలుగును, ఐశ్వర్యము కలుగు నని చెప్పుచుఁ దానుమాత్రము దుర్బలుఁడై దిగంబరుఁడై తిరుగుచుండును. మఱియు రాగిచెంబువంటి బోడి తలతో రసాయనములు పెక్కులు తినుటచే ముసలితనముం బొందినట్లు నరసిన శరీరము గలిగిన ధూర్తుఁడు, బట్టతలవాండ్రకుఁ జిమ్మచీఁకటి వంటి తలవెండ్రుకలు బైలుదేఱుట కుపాయములు చెప్పి మోసము చేయును.

సిద్ధు లనుమాటలువినితారకాసురశంబరాసురుల భార్యలంగూడఁ బొందవచ్చునని కొందఱు కాముకులు బిల్వఫలాదులతో హోమములు గావించి యాపొగచేతనే గ్రుడ్డివారై యేడ్చుచున్నారు. పెక్కండ్రు, మూఢులం జేరి "యాకాశపుష్పము దొరకెనేనిఖేచరస్త్రీలు సులభసాధ్య లగుదురు, దోమ యెముక సంపాదించినచో దానివలన ననేకసిద్ధులు కాఁగలవు, నల్లగుఱ్ఱపు మూత్రముతో వత్తిచేసి దీపము వెలిఁగించి చూచితిమా గగనంబునఁ గలదేవేంద్రభవనము కనఁబడును, కప్పకొవ్వు పూసికొంటిరేని నరు లప్సరసలకుఁ బతు లగుదురు" అని చెప్పు సిద్ధులకు

లోపడి లోభముచే, నేమో! చేసితిమా సంభవించు నేమో యని మోసపోవుచున్నారు.

కామతంత్రమూలమంత్ర మెఱుంగని వశ్యాకర్షణ సిద్ధులు వీథులలో నిలువంబడి స్త్రీలకు రక్షలు కట్టుచున్నారు. మాౘరములలో నిలిచి కుత్సితయోగులు కొందఱు మర్భోషలు చేసి యెఱుకలవాండ్రవలెఁ దెలివిలేనివారి ధనదారాదులను హరించుచున్నారు. ఈమె చేతులలోని రేఖలుమాత్రము బహువిపులముగా నున్నవి కాని పెనిమిటి చలచిత్తుఁ డెట్లయ్యెనో యని చెప్పుచు సాముద్రికుఁడు కులకాంతల కోమలకరతలములం బట్టుకొని నలఁపును. అంజనము వేయువాఁ డొక్క వ్రేలిమీఁద నీటిబిందువుంచి దానిలో నొకకన్యం గాంచుచున్నట్లు వివిధ ప్రశ్నలు వేయునుగాని దొంగ లెత్తుకొని పోయిన వస్తువులనుమాత్రము గానలేఁడు. మంత్రరహితములగు క్షుద్రధూపములచే క్షుద్ర దేవావేశముంబొందితిమని ప్రలాపకారులై ప్రభువులచే దెబ్బలుతినుచుఁ దిరుగుచుఁ గొందఱుందురు.

ఈ నాచంకలోని పుస్తకము నాగార్జునతంత్రము. దీని వలన బహుసిద్ధులు లభించును. కనుంగొనుఁడని ధూర్తులు కొందఱు పరులవిత్తము భస్మము గావించుచున్నారు.

యక్షీపుత్రు లను కొంతమంది కపటజపములు నసత్యధూపములతోఁ బూజలొనర్తురు. వారికిఁ బ్రత్యక్షఫలము దారిద్ర్యమును రాజక్రోధమును.

ఈధనికుఁడు నాకూఁతును గొనిపోయి పెంచుకొను చున్నాఁడు. ఆచిన్నది నాది, యని చెప్పుచుఁ దగవుపెట్టి కన్యా

ర్థముగాఁ గొంతధనము వారియొద్దఁ గొని పలువురు జీవించుచున్నారు. ఇంగితజ్ఞుఁడు, నచింత్యుఁడు, మర్మజ్ఞుఁడు నని కొందఱచేఁ బొగడఁబడుచు మప్పుడలచే మాటలాడక కూర్చుండువాఁడు హృదయచోరుఁడు.

బూడిదపూసికొనిన వేశ్యలు, ముదిలంజెలు, శ్రమణలు, గణికలు, వీరు కులస్త్రీల ధనశీలములను హరింతురు.

ధనముగల తరుణవిధవ తనకుఁ దగిన పతికై యత్నించును. అందుకుఁ దగిన ధూర్తుఁ డొకఁడు సిద్ధపడి యామె సర్వస్వమును హరించును.

దిన దినము కూలి పుచ్చుకొనుచు వడ్రంగులు, గోడలు పెట్టు తాపిపనివాండ్రు మున్నగువారు సరిగ పనిచేయక విఘ్నములు గావించుచుందురు కావున వీరు కాలచోరులు.

హస్తలాఘవాదులు బాగుగ నేర్చి ప్రసిద్ధులగు జూదగాండ్రు తాము వినోదక్రీడలయందును బూచికలయందు నేస్తమని దేశములు త్రిప్పుచుందురు.

వారియింట వారియింట భోజనము చేయుచు, జూదమున బానమున వేశ్యలకు బహువ్యయము చేయువాఁడు గృహచోరుఁడు.

శాస్త్రమబద్ధము, పరలోక మెవ్వరిచేఁ జూడఁబడినది, యనుచు నిరంకుశంబగు మత్తమాతంగముఁరీతిఁ దిరుగుచు డబ్బే ప్రధానమని లోభముచే ఋణముపడినవారిని బాధించి గడించువాఁడు లోభచోరుఁడు.

రాజసభ లనుసముద్రముల నడుమ సతతభక్షులై బడబాగ్నులవలె వెలుంగుచు జనుల ధనమనసాములఁ దగులఁబెట్టువారు భట్టాఖ్యులగు న్యాయచోరులు.

విభవాంభోరుహమధుపములు విపదనిలవేగ విముఖులు నగు చెలికాండ్రు లక్ష్మీలతచేఁ బిలువఁబడిన సుఖచోరులు.

అపూర్వముగా నొక్క స్వల్పవిషయముం గల్పించి యసంబద్ధమగు దానిని విశేషించి వర్ణించి వాక్షముం బుట్టింపఁ జూచువాఁడు కర్ణచోరుఁడు.

దోషములను గుణములుగ స్తుతించుచుఁ జతురవచనములచే వినువారికి శ్రద్ధను గల్పించి యభినవసృష్టి నొనర్చువారు నిరాచారు లగు స్థితిచోరులు.

అతియత్నమునఁ బరగుణములను గప్పిపుచ్చి తనగుణములం బ్రకటించుకొనఁగోరు పరమ ధూర్తులు మూఢులహృదయములం బ్రవేశించు గుణచోరులు.

ఒక్కరి కొకరియందుఁ గలగాఢానురాగమును లేక వాల్లభ్యమును విచిత్రమగు పిశునస్వభావముచేఁ దమపైకి మరలించుకొని మాత్సర్యముచే మొదటివారికి హానిగలిగించువారు వృత్తిచోరులు.

శమదమరహితుఁడు భక్తిశూన్యుఁడు తీవ్రవ్రతదుర్గ్రహగ్రస్తుఁడు నై సాధువులను దనకుఁగల కలిమిచే నవమానము చేయువాఁడు కీర్తిచోరుఁడు.

దేశాంతరమున లభించు భోగాదులను వారి యెదుట వర్ణించి చెప్పుచుఁ బహుప్రాయులను దేశాంతరగమనోన్ముఖులం జేయువారు దేశచోరులు.

హాస్యవికారములతోడను నేర్పులతోడను వర్ణచిత్రములతోడను బగలంతయు వెళ్లఁబుచ్చువారు వ్యాపారచోరులనం బడుదురు.

లేమఘన మంతయుఁ గోల్పోయి పిమ్మటఁ బరధనహారణమున కుపాయ మాలోచించుచు నిరంతరము వేశ్యలయిండ్ల స్తోత్రపాఠములు చేయు విటులను గొంత యోజింపవలసినదే.

అతిశుచిగా నటించుచు గొప్పవాఁడను పెద్దయధికారి నని నియమసలిలముల మత్స్యముకేతినుండు నిస్పృహానియోగిని బరిహరింపవలయును.

రాజమార్గములం దిరుగు పాపులగు వర్తకులు ప్రతియింటికిఁ దామె పోవుదురు. వారేమి తమ కిచ్చెదరో దానిని గాజు పెంకుఁ జేయుదురు. తా మిచ్చిన గాజు పెంకును వజ్రముగా గణింతురు.

ఇచ్ఛావర్తనము గలవారును దాము మొదలిడినపని చెడ్డదైనను మంచి దనువారును సర్వాపహారులే. వారు విషమువలె ముందు సుఖముగఁ బ్రవేశించి పిమ్మట వేధింతురు.

నీపై రాజునకు దయగలదు, నిన్ను మిక్కిలి రహస్యమునఁ బొగడుచుండు నని చెప్పి రాజదాసులు సేవకులను వంచింతురు.

నేనుజేయు మాసోపవాసమునకు ఫలముగా రాత్రి నేను లక్ష్మిని గాంచితిని. పద్మము చేతఁ బట్టుకొని మాయింటం బ్రవేశించినది. మీపై బ్రీతిఁబొందితి నని నుడివినది. న న్ననిశముం గొల్చుచున్నారు, వీరు నాకు దాసు లని మిమ్ము గుఱించి నాతోఁజెప్పిన దని సాధారణుల యొద్ద ధూర్తులు పొగడుచు మెలంగుచుందురు. నగరోపద్రవమునుపట్టునఁ బురమహోదయంబున యజ్ఞవివాహాదులను బంధువేషములం బరులలోఁగూడ ధనాఢ్యులయిండ్లకుం గొంద ఱండ్రుకొనఁ బ్రవేశింతురు. తనతోడివారు మద్యపానము చేయునప్పుడు తాను మాని రాత్రులెల్ల జాగరూకుండై మేలుకొని సేవావిషయమునందు ధ్యానపరుండై యుండువాఁ డేదియో దుష్కార్యము చేయ నూహించుచున్నాఁ డని యెఱుంగునది. ప్రతివచన మీయఁడు; ఇచ్చినను విషముగను గద్గదకంఠముతో నిచ్చును. నష్టముఖుఁడు సోచ్ఛ్వాసుఁడు వడంకువాఁడును దొంగ. అనవరతము నాచారయుతుఁడై యుండఁ గోరును, డంబముగా నగవడును, తలంచుకొని యున్న దుష్కృత్యములం గప్పియుంచు నిట్టి గుణంబులు గలయాతఁడు పాపాత్ముఁడు. ప్రత్యక్షముగాఁ గాని చాటున నేని చేసినది చేయని యట్లు, చెప్పినది చెప్పనియట్లును నిర్వికారుండై చెప్పువాఁడు నరులకు భయస్థానమే. ముగ్ధభావముం గృత్రిమముగాఁ గల్పించుకొని షండునివలె స్త్రీవేషభాషలతో మగువలనడుమ సంచరించుచుండు నాతఁడు నిశ్చయముగఁ గామదేవుఁడే. ఎల్లప్పుడు నధోముఖుండై సంపద యున్నను మలినవస్త్రధారి యై కోశా

గారమున నున్న న్యాయసభాం డాభవనాగారమున కేలుకయె. తన యింట దినమంతయు నుండియేని బంధుగులయింట నుండి కాని యితరగృహకథలు చెప్పు వాతఁడు చాయఁ డని యెఱుంగునది. అతని నింటఁ జేరనీయరాదు. నిందార్హములగు కార్యము లొనర్చి దండింపఁబడి బహుకాలము శిక్షింపఁబడినాతని దగ్గఱిదీయుట బ్రతికియున్నంతవఱకు భయమును దనయింట స్థిరరాశి యుం డుచుకొనుటకే. మూర్ఖుని జేరి వానిరహస్యము లన్నియుఁ గనిపెట్టి వినోదమునకువలె వానివలనఁ జేయఁబడినకృత్యము లనువిని యాతని సంగతిపరులతోఁ జెప్పెద నని భయపెట్టి తనువలలలో వైచుకొను ధూర్తు లనేకులుగలరు. రాజశాసనవిరుద్ధము లగు నాణెములో, కృత్రిమలిఖితము లగు పత్రపుకాగితములో ధూర్తులు కొందఱు ధనికునింట నెవ్వరికిఁ దెలియకుండఁ బెట్టి పోయి పిమ్మట వానికి ధననాశనముం గావింపఁ జూతురు. అపూఁటకు గతిలేక సంపన్నుని పంచఁ జేరి కడుపునింపుకొనుచు నెల్ల వారితో శాస్త్రివాదములు చేయుచుండువాఁ డాగృహస్థునికై వేచియున్న పాశహస్తుఁ డగుయముఁ డనుటకు సందేహము లేదు. లజ్జాధనుఁడు, కులీనుఁడు, శుద్ధశీలము మర్యాదయుఁ గలిగి జనులచేఁ బొగడఁబడువాఁడు నగు సజ్జనుఁడు ధూర్తసహవాసముండెనా యేదో నీచస్త్రీసంపర్క మున్నట్లు వానిచే లోకమునకు వెల్లడి చేయఁబడుచు లజ్జాభరమున స్త్రీవలె నగుచున్నాఁడు. పెనిమిటి గ్రామాంతరమందున్న ముగ్ధలగు మానినులను దుష్టలు చూచినవియుఁ జూడనివియుఁ గ్రూరములు నబద్ధములునగు వచనములచే మోసము చేయుచుందురు. జనస

ముద్రములో సాధువేషముతోఁ జొచ్చి భూషణాదులను ధూర్తలు దొంగిలింతురు. ఎవ్వరైనఁ బట్టుకొనిన నవ్వుటాలకుఁ దీసితిమందురు; అట్లుకానినాఁడు వానినిహరింతురు. మఱికొందఱు డాంబికవేషములతో నితరదేశముల నందఱయొద్ద ధనమును వివిధమిషలమీఁద సంగ్రహించి కుంభములన్నిండించిభూమిలోఁ బాతిపెట్టి నాయొద్ద సొమ్ములేదని (దివాలాయని) చెప్పుచుఁ గొన్నియెం డ్లక్కడ బీదపడినట్లుండి యొక్కనాఁ డాధనమును సంగ్రహించుకొని చెప్పకుండ స్వదేశములకుఁ బాఱిపోవుదురు. పలువురు దుష్టులు శుభ్రకనకభూషణములు మృదువస్త్రములు మున్నగునవి ధరించి సంభ్రమముతో విరోధులచే నిర్జింపఁబడిన రాజపుత్రుల మని ధనికులయింట డాఁగిన ట్లుండి మోసము చేయుదురు. ధూర్తులచే నమ్ముఁబడు మేకలను దమయింట బలిసిన దుష్టవృషభముల నిచ్చి పుచ్చుకొని వెఱ్ఱివారు పిమ్మట దుఃఖింతురు. పాపులు, "గొప్పవారమని సంపద యున్నపుడు యాచకుల నాక్షేపించుచు నిచ్చుచుండు" రని యసూయపడుచుండ వారికిఁ బేదవారుకూడ భయముచే నెక్కడనైనఁ గొంతవిత్తము సంపాదించి యిచ్చెదరు. ప్రాఁతభుజపత్రముల పుస్తకములో వివిధములగు చక్రాదులు లిఖించి యిందు విశేషార్థమున్న దని దానిం జంకఁ బెట్టుకొని దేశదేశములు తిరిగి కృత్రిములు ధనవంతులయొద్ద వేలకొలఁది దోచుకొందురు. కొందఱు విదేశములందు గంగాయాత్రకై బయలుదేఱితి మని చెప్పుచు నివసించి చనిపోయిన బంధువుల పేరులు చెప్పి ధనముం గడింతురు. వేశ్యలు ముగ్ధులకు రాత్రులు గోచిపెట్టి యింటికిఁ బంపింతురు.

ధూర్తులు వానినే కూటరూపము (కోటారూపాయలు) లిచ్చి వంచింతురు. వర్తకులయంగడిలో బహుమూల్యము లగు వస్తువులు పుచ్చుకొని యిదిగో సొమ్ము తెచ్చెద నని నమ్మకమున కై యక్కడఁ జెవిటివానినో మూఁగవానినో యుంచి నిమిషములో వంచకులు మాయ మగుదురు. కించిత్పరిచయము చేతను, కొంచెము దర్పము చేతను, నించుకస్వకల్పన వలనను, కొంతవివాదలచేతను, నొక్కింత కలహమునను సర్వజ్ఞులగువంచకులు దిరుగుచున్నారు. లేనిదే ధన మున్నట్లు నటించుచు, గ్రంథములఁ జేతఁబట్టి విద్వాంసులట్లు చరించుచుఁ, గళాభిజ్ఞులకీర్తి నడయాడుచు, వర్ణనాశూరు లగుచుఁ జతుర్ముఖులై ధూర్తులు ప్రబలుచున్నారు. సర్వావయవముల నాడించుచు నింటిపై విరక్తిగనఁబఱచి పరదేశమున కేఁగి స్వేచ్ఛాచారియగువాఁడు మహాధూర్తుఁడు. నూఱేండ్లక్రిందటి యుసిరికాయ భక్షించి యీయోగమును శ్రీపర్వతమునందుండి సాధించితి నని గురువుల యొద్ద శకునముం జెప్ప స్మరణము నటించువాఁడును ధూర్తుఁడె. ఇట్టివి స్వల్పరీతిగ నఱువదినాలుగు విధముల మాయలను జెప్పితిని, గాని, వంచకుల మాయాసహస్రము నెవ్వఁడు తెలిసి కొనఁ గలఁడు?

---

## దశమసర్గము.

ఇవి యన్నియు వంచకులు చేయు వంచనలు. వీని దెలిసికొని జాగ్రత్తగా నుండఁ దగినదియే కాని తెలిసినవిషయములు గదా యని తా మాచరింపఁగూడదు. ఈకళాకలాప మభివృద్ధికొఱకు జ్ఞానవంతులు తెలిసికొనుటవిధి. ధర్మకళలు—ముఖ్య

ముగా భూతదయ గలిగియుండుట, పరోపకారము, దానము, శాంతి, అసూయలేమి, సత్యము, లోభము విడనాడుట, దయయును. అర్థకళలు—నియమపరిపాలనము, ఎల్లప్పుడు జాగ్రత్తగానుండుట, చేయవలసినదాని నెఱుంగుట, స్థానత్యాగము, పటుత్వము, తొందరపడకుండుట, స్త్రీలను విశ్వసింపకుండుటయును. కామకళలు—వేషశోభ, పేశలత, చారుత, గుణోత్కర్ష, నానావిధలీలలు, వనితాచిత్తజ్ఞానమును. మోక్షకళలు—జ్ఞానాదరము, శమము, నిరాశ, సంతోషము, సంగత్యాగము, పరమప్రకాశమును, మత్సరము విడనాడుట, ప్రియవాదిత్వము, ధైర్యము గలిగియుండుట, వైరాగ్యము, పరమార్థచింత, యీమైమను సి[illegible]కళలు. సత్సహవాసము, కామజయము, శౌచము, గురుశుశ్రూష, సదాచారము, వ్రతము, యశస్సునందభిరతి యనునేడును శీలకళలు. తేజము, సత్త్వము, బుద్ధి, వ్యవసాయము, నీతి, ఇంగితజ్ఞానము, ప్రాగల్భ్యము, సుసహాయము, కృతజ్ఞత, మంత్రగోపనము, త్యాగము, అనురాగము, ప్రతిపత్తి, మిత్రసంపాదనము, అహింస, చుఱుకుందనము, ఆశ్రితవాత్సల్యమునను పదేడును ప్రభావకళలు. మానము, లౌల్యవృత్తి లేమి, యాచింపమి యీమూఁడును మానకళలు:—ఈయఱువదినాలుగుకళలును మొత్తమున నేర్పునఁచే గ్రహింపఁబడఁదగినవి. సమానవిరోధమున్నచోటనే దండెత్తినను నమస్కరించినను. బలోదయమైనచోటనే వైరము మాపుట. ఆర్తులపైఁ గరుణ, దుఃఖములో ధైర్యము వహించుట, సుఖపడుచున్నపుడు గర్వము లేకయుండుట, ఐశ్వర్యమున్నపుడందఱకుఁ బంచిపెట్టుట, సంశ

యస్థలములలో నాలోచన చేయుప్రజ్ఞ, కూడనివానియందు విముఖత యీయాపదియును మనుష్యున కౌషధములు.

సత్యములలో గురువచనము సారతర మయినది; చేయవలసినపనులలో గోద్విజసురపూజనము సారతరము; పాపముల లోభము, సర్వోపతాపములఁ గ్రోధంబు సారతరము. సర్వసుగుణులయందుఁ బ్రాజ్ఞుఁడు సారతరుఁడు; విభవము గలవానికిఁ గీర్తి సారతరము; దుఃఖములలో సేవ సారతర మైనది; కాలపాశంబులం గట్టువడుట కాశ, కోటీశ్వరులకు దానము, హాయిగానున్న వానికి విరోధము లేకయుండుట, మానహాని చేయుటకు యాచించుట, కష్టపడువారి మఱింత బాధపెట్టుటకు దారిద్ర్యమును సారతరంబులు; దారిబత్తెమునకు ధర్మ మాధారము. సుందరవదనారవిందమునకు సత్యవాక్య మలంకారము. రోగములలో దుఃఖము చెడ్డది. గృహసమృద్ధి చెడుట కాలస్యము కారణము. పొగడికలయందు నిస్పృహ మంచిది. రుచియైన పదార్థములందుఁ బ్రియవచన మెక్కుడు రుచి గలది. తిమిరాపహారి దర్పమే. నవ్వులపాలగుటకు దంభము కారణము. శౌచములలో నద్రోహ ముత్తమంబు. వ్రతనియమంబులఁ జపలతయుండరాదు. అప్రియములఁ బిసునస్వభావము, హింసావ్యాపారములలో వృత్తిచ్ఛేదమును సారవంతములు. పుణ్యములందుఁ గరుణయుత్తమము. చేసినమేలు మఱవకుండుట పురుషలక్షణము. మోహామతులకు మాయ యాధారము. నరకమున కేఁగువారు పొందినమేలు మఱతురు. దొంగలకు మిషచెప్పుట మంచి పని. స్త్రీవచనము జ్ఞాతి భేద మొనర్చును. చండాలురలోఁ గ్రూరుఁ

డెక్కుడు. మాయావులు కలియుగావతారులు. మణిదీపముకంటె బ్రకాశమానమైనది శాస్త్రము. అభిషేకములలో నుపదేశము సారతరము. ముసలితనము కేశములకెల్ల నెక్కుడయినది. మరణతుల్య దుఃఖముం బొందుచున్నవారికి రోగమువచ్చినఁ జెప్పనలవికాదు. విషమవిషయములందు స్నేహము సారతరము. వేశ్యానురాగమునఁ గుష్ఠాదిరోగములు కలుగుచు. భార్య సంసారమునకు సారము. పరలోక బంధువులలోఁ గొడుకు మొదటివాఁడు. నూఱుమేకులు గుచ్చుకొన్న బాధకంటె శత్రుత్వ బాధ గొప్పది. దుష్టపుత్రునివలనఁ గుణముచెడును. సుందరాంగులలోఁ దరుణవయసుగలది మిన్న. పై మెఱుఁగులు వేసములువేసి తిరుగువారికి స్వభావసురూప ముండకున్న లాభమేమి? సంతోషము ప్రభుత్వముకంటె నధికము. రాజాధిరాజభోగ మనుభవించువానికైనను సత్సహవాస ముండవలెను. చింత నరుని గృశింపఁ జేయును. వైరము తరుకోటరాగ్నికంటె నెక్కుడు తేజముగలది. స్నేహితుఁడు నమ్మఁదగినవాఁడు. వ్యాధియందు సంకోచము తగినది. నిర్జలాంధకూపములకు (నిర్గంధకుసుమమన్నట్లు రిక్తులకు) కుటిలత స్వభావము. స్వచ్ఛమానసులకు ఋజుప్రవర్తనముండును. కలవానికి వినయము భూషణము. దుర్వ్యసనములలో ద్యూతము చెడ్డది. మణుల కంకణము లున్నచేతికి దానము నగవంటిది. చెవు లున్నందులకుఫలము శ్రుతముండవలెను. (శాస్త్రాదులవినికి). చపలులకు స్నేహితులు ఖలులు. వృథాప్రయాసముకంటె దుర్జనసేవ మేలు. ఉద్యానములకుఁ గంచె రక్షణము. అమృతవాక్యములు గలవానికిఁ బ్రియదర్శనమున్న వన్నె మెచ్చు

ను. సంపాదించుకొను వస్తువులలోఁ దత్త్వము ముఖ్యమైనది. మూర్ఖసభకుఁ బోయిన వివేకము చెడును. సఫలతరులలో సత్త్వ లీనుఁ డైన మఱెంత లెన్న. సౌభాగ్యము కృతయుగ పురుషులకుఁ గాని లభియింపదు. రాజులనును శంకించుచుండ వలయును. స్వభావకుటిల మయినది స్త్రీహృదయము. స్తోత్ర ముచితరీతి నుండఁ దగును. చందనాది విలేపనము నందు రాగముకంటె గుణరాగము మంచిది. కన్యాత్వము శోకకరము. బుద్ధిహీనులపైఁ జాలిపడవలయును. సౌభాగ్యములలో విభవము మొదటిది. కీర్తిమంతులకు జనానురాగ మాధారము. వేతాళులకు మద్యపానము ప్రియము. స్వస్థులకు శాంత ముండిన లెస్స. తీర్థసేవాపరాయణుల కాత్మబోధయం దాసక్తి యుత్కృష్టము. లుబ్ధునకు ఫలము లభింపదు. ఆచారవిహీనుఁడు శ్మశానసమానుఁడు. స్త్రీలను రక్షించుట న్యాయము. ప్రభావంతున కింద్రియవిజయము శోభనిచ్చును. కుచ్ఛితస్థలమృతులకుఁ గీర్తిరాదు. మాంగళ్యములకుఁ దల్లియు, సుకృతోత్సవాభ్యుపదేశములకుఁ దండ్రియును ముఖ్యులు. కఠినులను దండింపవలెను. వాఁడిగల యస్త్రశస్త్రములను ఛేదింపవలయు. నమస్కారమునఁ బాపపరిహార మగును. కృచ్ఛ్రయాచ్ఛాసులలో సౌహార్దము సారతరము. మానమువలన బలమబ్బును. సంసారులు కీర్తికాములుగా నుండఁదగు. నీతులలోఁ బ్రభుభక్తి దొడ్డది. రణములోనిచావు సౌఖ్యములయం దాదిది. కళ్యాణములలో వినయమును, సర్వసిద్ధులలో నుత్సాహమును, సారవంతములు పొందఁదగినది యొక్క పుణ్యమే. జ్ఞానము పరమప్రకాశము.

సమస్తజనులును స్త్రీని ముఖ్యముగా గణించుకొనవలయును. సమస్తవర్ణములవారిలో బ్రాహ్మణుఁడు స్త్రీకళాకలాపమునఁ గుశలుఁడు సర్వార్థతత్త్వవిజ్ఞాని యనియు, సేవకుని మిత్రుల శ్రేష్ఠుఁడనియుఁ దెలియుఁదగినది. శుభాశుభమూలము లగు నీనాలుకలల నెవ్వఁడు గ్రహించునో వానికే దృష్టాదృష్టహాపి సిద్ధియైనలక్ష్మీ వ్యవహారములాగుఁ గరగత మగును.

ఇట్లని మూలదేవుఁడు శిష్యులకుఁ జక్కఁగ బోధించి యిండ్లకనిపి కిరణకళావిలాసమును మిగిలినరాత్రిని స్వగృహమున విశ్రాంతిఁ బొందెను.

క్షేమమయము, స్మితవిలాసకలాభిరామము, సర్వాశ్రయాంతరకళల నెఱిఁగించునది, లోకోపదేశవిషయము, సుకథావిచిత్రము నగు నీకళావిలాసము సజ్జనులకుఁ జెలివలె నగుంగాత !

క్షేమేంద్రమహాకవి ప్రతిభాసముద్రమునుండి వెడలిన యీకళావిలాసము సత్పురుషులకు శశివలె హృదయానందముం గావించుఁ గాత !

---

ఇది క్షేమేంద్రమహాకవివిరచిత సంస్కృతకళావిలాసమునకు.
కొత్తపల్లి సూర్యరావుచేఁ జేయంబడినఁ దెనుఁగు.
సంపూర్ణము.

---

# అళియరామరాయలు.

ఇది కృష్ణరాయని అల్లుఁడును, తాళికోటయుద్ధమున అపారపరాక్రమము ప్రదర్శించినమహాయోధుఁడునగు రామరాయనిచరిత్రము. హేరాసుపండితుఁడు వ్రాసిన చరిత్రమునందలి పొరపాటులన్నియు నిందు సోదాహరణముగ విమర్శింపఁబడినది. ఇది విఖ్యాతాంధ్రచరిత్రకారులును, చరిత్రచతురాననబిరుదాంకితులునగు చిలుకూరి వీరభద్రరావుపంతులుగారిచే నతిపరిశ్రమతో మనోహరముగ రచింపఁబడినది. వెల 1—8—0.

# భాగవతకథాలహరి.

బమ్మెర పోతనామాత్యుని ఆంధ్రమహాభాగవతము ననుసరించి, అక్కడక్కడ నందలి పద్యములు క్రోడీకరించుచు పండిత ద్రోణంరాజు సీతారామారావుగారిచే నిది రచియింపఁబడినది. భాగవతమున కంతకును ప్రధానములగు కథలు యిందు 29 కలవు. శైలి మృదుమధురమును, ధారాళమును. అచ్చువు కాఁబడినది. వెల 1—0—0

భారతకథాలహరి 1—0—0 మహాపురుషులు 0—14—0

హిందూదేశచరిత్రకథలు 2 భాగములు 1—4—0

# తిమ్మరుసుమంత్రి.

గ్రంథకర్త: చిలుకూరి వీరభద్రరావుగారు.

ఆంధ్రదేశమున తిమ్మరుసుపేరు తెలియనివారుండరు. అట్టిమహనీయుని చరిత్రము చరిత్రాత్మకముగ వ్రాయఁబడినది అవశ్యపఠనీయము. వెల 1—0—0

# తిక్కనసోమయాజి.

తిక్కనసోమయాజి ఆంధ్రభారత గ్రంథకర్తయగు కవి. తిక్కనచరిత్రము ప్రతివారికిని అవశ్య పఠనీయము. వెల 1—0—0.

---

## ఆర్షపుస్తకాలయము, రాజమహేంద్రవరము.